
దాగుడు మూతలు ఆడేవాళ్ళు
ఈ రణబాని ఓడించాలని చూసేవాళ్ళు
వాళ్ళందరితో నాకేం పనింక
చేస్తాగా నే కొత్తవింత ఏదో ఇంక.
నా ఎకో పెన్నుల సెట్టు
కాలక్షేపాన్నదే తెచ్చి పెట్టు
ఇలావేస్తా నే గోడమీద బొమ్మ గొలుసుల బొమ్మ
అలా గీసేస్తా నే రెండుజడల అమ్మాయి బొమ్మ
ఎకో పచ్చ ఎకో నీలం
ఎరుపు పసుపు నారింజ రంగులమయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఒసెట్
ఉచితం!
కలరింగ్
ఫోల్డర్
EKCO
ఎకో
...చ్ పెన్ రంగుతే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!

# విజేతలైన బాలలకి మహారాజు పిలుపు!

మే నెల

Parry's

## Fun & Games

పోటీ

ఫలితాలు




విజేతలు :

<u>మొదటి బహుమతి :</u>

హరీందర్ సింగ్, బొంబాయి-400 071

<u>రెండవ బహుమతి :</u>

1. బానశ్రీ భద్రా, 24 పరగణాలు
2 శైలేంద్ర రమణ, పూనే

<u>మూడవ బహుమతి :</u>

1. జి. ప్రసన్న, మద్రాసు-600 059
2. కె. రంగనాథన్, పి.వి. కలత్తూరు
3. వర్గీస్ ఫ్రాన్సిస్,
బొంబాయి-400 074

కన్సొలేషన్ బహుమతి నెగ్గినవారికి పోస్ట్‌ద్వారా తెలియచేయబడుతుంది.

ఇవిగో సరియైన సమాధానాలు!

ప్రపంచంలో పెద్ద సముద్రం : పసిఫిక్ మహాసముద్రం; సూయజ్ కాలువ కలిపిన రెండు సముద్రాలు : ఎర్ర సముద్రం మరియు మధ్యధరా సముద్రం; ట్సాంగ్‌పో దేనికి టిబెటియన్ పేరు : బ్రహ్మపుత్ర; అర్జెంటీనాని చుట్టివున్న సముద్రం : అట్లాంటిక్; దక్షిణ అమెరికాలో పొడవైన నది : అమెజాన్; బైకాల్ సరస్సు వున్న దేశం : సోవియట్ రష్యా; నాసర్ సరస్సు వున్న దేశం : ఈజిప్ట్; వాన్ సరస్సు వున్న దేశం : టర్కీ; విన్నిపెగ్ సరస్సు వున్న దేశం : కెనడా.



# ఛాంపియన్ యొక్క కొత్త విజయ రహస్యం!




# బూస్ట్

విటమిన్లతో కూడిన శక్తినిచ్చే ఇంధనం


Kwality
CHOCO BAR
dairy fresh
dairy delicious
Kwality
CHOCO BAR
ఆటపాటల అలసిన వేళల
చిన్నారి బాలల కింపైన క్వాలిటీ వారి
ఐస్‌క్రీమ్స్ 'చాకోబార్' 'మినీబాల్'
మరియు 'పుషప్స్'
Kwality
MINI BALL
CONTENTS 180 ML. WHEN FILLED
Kwality
PUSH UPS
ICE CREAM
LAA
క్వాలిటీ
ఐస్‌క్రీమ్స్
BOMBAY'S
Kwality
ICE CREAM
వి.బి.పి. ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్
ఫోన్లు: హైదరాబాదు: 263287, విజయవాడ: 58351, విశాఖపట్టణం: 69397, కాకినాడ: 6525, రాజమండ్రి: 2199, గుంటూరు: 33588, ఒంగోలు: 3171, నెల్లూరు: 4519, తిరుపతి: 2501, ఏలూరు: 21670, వరంగల్: 4921 P.P., కరీంనగర్: 3170, నిజామాబాద్: 22226, ఖమ్మం: 3096,


కొత్త
హార్లిక్స్ బిస్కెట్స్.
కొంతమంది మంచి రుచి నిపుణులు
యిలా అంటున్నారు...
ఊ... నిస్సందేహంగా మరింత రుచికరం
ఎంతగానో పాలతో నిండినవి
నిజంగానే సంపూర్ణమైన హార్లిక్స్ మంచితనం
NEW
Horlicks
BISCUITS
కొత్త
హార్లిక్స్ బిస్కెట్స్
ఇప్పుడు
రుచికరమైనవి, పాలతో నిండినవి, మరియు సంపూర్ణమైన హార్లిక్స్ మంచితనం.
HTA 5456 TEL

CHANDAMAMA PUBLICATION

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''నందిని నవ్వు'']కు ఆధారం, ఎన్. శివనాగేశ్వరరావు రచన. సమాజంలో తన స్థానమేదో గుర్తించి, తదనుగుణంగా ప్రవర్తించడం, అందరికీ చేతనైనపనికాదు. ఎందుకంటే కొందరికి వాస్తవ పరిస్థితులు అర్థం కావు; మరి కొందరికి ఊహాలోకానికీ, వాస్తవలోకానికీ మధ్య వున్న తేడా తెలియదు. అలాంటప్పుడు జరగబోయేదేమిటో, ''దూరపుకొండలు'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

యద్యదా చరతి శ్రేష్ఠః, తత్తదేవేతరో జనః,
సయత్ ప్రమాణం కురుతే, లోకస్తదనువర్తతే.

[గొప్పవారు చేసే పనులనే మామూలు ప్రజలు అనుసరిస్తారు. గొప్పవారు అంగీకరించే ప్రమాణాల్ని అనుసరించే ప్రపంచం నడుస్తుంది.]

సంపుటి 83 జూలై '88 సంచిక 1

విడి ప్రతి : 2-50 :: సంవత్సర చందా : 30-00


APOLLO
Launch pad..
for super drawing
APOLLO
Little People
CRAYON PENCILS
– for space age kids like you.
APOLLO PENCILS PVT. LTD.
107, Regal Industrial Estate, Acharya Donde Marg, Sewree (West),
Bombay-400 015. Ph : 4133295/4133215.
Distributors: GREATER BOMBAY: D. Jagjivandas & Company, 177, Abdul Rehman Street, Bombay-400 003. Ph.: 326524 MAHARASHTRA: A. Ashok & Company, 107, Regal Industrial Estate, Acharya Donde Marg, Sewree (West), Bombay-400 015. Ph.: 4133295/4133215 GUJARAT: N. Chimanlal & Co. 'Jasmin' Building, Near Firdaus Flats, Khanpur, Ahmedabad-380 001. Ph.: 395188/398670 DELHI, HARYANA, PUNJAB, J.K. & HIMACHAL PRADESH: Bharati Traders, 29, Chawri Bazar, Delhi-110 006. Ph.: 262854 KARNATAKA, ANDHRA PRADESH & GOA: Sanghvi Corporation, Suresh Bldg., No. 17, 14th Cross, Kalasipalayam New Extension, Bangalore-560 002. Ph.: 225702 CALCUTTA & WEST BENGAL: Sanghvi Corporation, 14/1/1A, Jackson Lane, 2nd Floor, Calcutta-700 001. Ph.: 262141 UTTAR PRADESH: Sanghvi Corporation, 7-A Balmiki Marg, Kaiser Bagh, Lucknow-(U.P.) Ph.: 48301 TAMIL NADU: Sanghvi Corporation: Balna Complex, 1st Floor, 35, Stringer Muthia Mudaliar Street, Madras-600 079. Ph.: 22304. REST OF INDIA: Sanghvi Corporation, 107, Regal Industrial Estate, Acharya Donde Marg, Sewree (West), Bombay-400 015. Ph.: 4133295/4133215

# మేలు - కీడు

సుధర్ముడనే రాజు దగ్గరికి, భటులు ఒక యువకుణ్ణి తీసుకువచ్చారు. వాడు పరదేశీయుడు. బాటసారులపైబడి దోచుకుని, ఒకరిని హత్య చేశాడన్న నేరం మోపి, వాణ్ణి రక్షకభటులు బంధించి తెచ్చారు. రాజు విచారణజరిపి వాడికి మరణదండన విధించాడు.

పెడరెక్కలు విరిచి కట్టబడివున్న వాణ్ణి, భటులు అవతలికి లాక్కుపోయారు. అప్పుడు వాడు ఏవేవో మాట్లాడసాగాడు. ఆ భాషరాజుకు అర్థం కాలేదు. ఏమిటని మంత్రిని అడిగాడు.

"మీ ధర్మనిరతిని వాడు మెచ్చుకుంటున్నాడు!" అన్నాడు మంత్రి.

రాజు చిన్నగా నవ్వి, "అలాగా! అయితే వాడికి మరణశిక్ష రద్దుచేసి, యేడాదిపాటు కారాగారంలో బంధించండి చాలు!" అన్నాడు.

వెంటనే సభలో నుంచి ఒకడు లేచి నిలబడి, "రాజా, వాడు మిమ్మల్ని కీర్తించడం లేదు; దూషిస్తున్నాడు. వాడు మాట్లాడే భాష నాకు తెలుసు," అన్నాడు.

రాజు ఆ మాటలు విని ఒక్క నిమిషం మౌనం వహించి, తరవాత అతనితో, "మంత్రి చెప్పిన అబద్ధం ఒక ప్రాణాన్ని రక్షించింది. ఇప్పుడు నువు చెప్పే నిజం ఒక ప్రాణం బలి కావాలంటున్నది. కీడు కలిగించే సత్యంకన్నా, మేలు చేసే అబద్ధమే శ్రేయస్కరం," అని, భటులకేసి తిరిగి, "వాణ్ణి కారాగారంలోనే బంధించండి, చాలు!" అన్నాడు.

సభికులు హర్షధ్వానాలు చేశారు.

—మంజుభారతి





# మూర్ఖపు కొండలు

మాణిక్యపురం జమీందారు మహీధరుడు మంచి దక్షతగలవాడేగాక, గొప్ప రూపవంతుడుగా కూడా పేరు పొందాడు. ఆయనది చాలా పెద్ద జమీ. ఆయన ఒకసారి దివానుతో కలిసి మామూలు రైతులాగా దుస్తులు ధరించి, ప్రజల బాగోగులు విచారిస్తూ, తమ జమీగ్రామాల్లో తిరగసాగాడు.

ఆ సమయంలో, ఒక గ్రామం దాపులో ఒక వ్యక్తి, చెట్టుకు ఉరితాడు బిగిస్తూ కనిపించాడు. జమీందారు అతణ్ణి సమీపించి, "చెట్టు కొమ్మకు ఉరితాడు కడుతున్నావు. ఇది నీ కోసమా లేక మరెవరికైనా సాయపడేందుకా?" అని నవ్వుతూ అడిగాడు.

ఆ ప్రశ్నకు, ఉరితాడు కడుతున్న వ్యక్తి వాళ్ళకేసి కోపంగా చూస్తూ, "ఈ లోకంలో నాకన్న దురదృష్టవంతుడు మరెవడైనా వుంటే గదా, ఉరిపోసుకు చావడానికి? ఈ ఉరితాడు, నా కోసమే!" అన్నాడు.

"అలా చెప్పు! ఇంతకూ నీ కొచ్చిన కష్టమేమిటి?" అని అడిగాడు జమీందారు.

"కష్టమా! అయ్యో, నాకొచ్చిన యీ కష్టాన్నుంచి, ఈ ఉరితాడు తప్ప, హరిహరబ్రహ్మదులు కూడా నన్ను తప్పించలేరు. నా పేరు సీతాపతి. చిన్నతనం నుంచీ ఎంతగానో ప్రేమించి పెళ్ళాడాలనుకున్న, నా మరదలు జలజాక్షి, నన్ను కాదని, యీ మాణిక్యపురం జమీందారును పెళ్ళాడుతుందట. వాళ్ళ నాన్న ఎంత నచ్చచెప్ప చూసినప్పటికీ ససేమిరా బుద్ధి మార్చుకోనన్నది. దానితో విరక్తి కలిగి, యిలా ఉరిపోసుకోబోతున్నాను." అన్నాడతను.

మల్లవరపు మనోహరరెడ్డి

జమీందారు ఆశ్చర్యపడి, "నీ మరదలుకు మతి చలించి వుంటుంది. మంచి వైద్యుడికి చూపించకపోయారా," అన్నాడు.

"నా మరదలి మతిచాంచల్యం వైద్యంతో కుదిరేదికాదు. అది చిన్నతనం నుంచీ జమీందారుగారి ధైర్యసాహసాలూ, గుణగణాలూ, అందచందాలూ—కథలుగా విని, ఆయన్నే పెళ్ళాడాలన్న పట్టుదలలో వున్నది," అన్నాడు సీతాపతి చాలా బాధగా.

జమీందారు కొంచెంసేపు ఆలోచించి, "జమీందారు, నాకు మిత్రుడు. ఆయనకు చెప్పి, ఎలాగైనా జలజాక్షితో నీ పెళ్ళి జరిగేలా చూస్తాను. దిగులుపడకు, వెళ్ళు," అని సీతాపతిని అక్కడి నుంచి పంపేశాడు.

తర్వాత ఆయన దివానుతో, "గ్రామానికి వెళ్ళి, ఆ జలజాక్షిని చూద్దాం," అంటూ బయలుదేరాడు.

ఇద్దరూ గ్రామంలో ప్రవేశించి, ఒక వీధి మలుపు తిరిగేసరికి, ఒక ఇంటి ముందు జనం గుంపుకట్టి వున్నారు. జమీందారు గుంపులో ఒకణ్ణి, "అక్కడ ఇంత జనం పోగయ్యారేమిటి?" అని అడిగాడు.

అందుకు గుంపులోవాడు, "ఈ ఇంటాయన కూతురుకు, జమీందారును తెచ్చి పెళ్ళి చేయాలట! పాపం, ఆ పిల్ల తండ్రి—జమీందారుతో పెళ్ళి కాదుగదా,



ఆయన దర్శనం కూడా చేయించలేనన్నాడు. దానితో ఆ పిల్ల నూతిలో దూకి చావబోయింది. సమయానికి నలుగురూ ఎలాగో కలిసి ప్రాణాపాయం నుంచి కాపాడారు,'' అన్నాడు.

ఇది విన్న దివానుకు, ఆ పిల్లపట్ల చాలా సానుభూతి కలిగింది. ఆయన జమీందారుతో, ''పాపం, అ పిల్ల మీ కోసం ప్రాణాలైనా వదిలేట్టుంది. పోనీ, తమరు వివాహమాడరాదా ?'' అన్నాడు.

జమీందారు కంగారుపడిపోతూ, ''ఉన్న ఒక్క భార్య చాలదా ? దయచేసి యిలాంటి సలహాలివ్వక, సీతాపతితో, జలజాక్షి పెళ్ళి జరిగే మార్గం ఆలోచించండి,'' అన్నాడు.

ఇద్దరూ దివాణానికి బయలుదేరి, దారిపొడవునా ఆలోచించి, చివరకు ఒక ఉపాయం కనిపెట్టారు.

వారం రోజులు గడిచాక, యిద్దరు భటులు జలజాక్షి ఇంటికి వచ్చి, ''వేటలో జమీందారుగారి కాలికి గాయమైంది, వైద్యుడు పరీక్షించి, ఉన్నచోటు నుంచి కదలకుండా విశ్రాంతి తీసుకుంటే తప్ప, గాయం నయం కాదన్నాడు. అందువల్ల, యీ గ్రామంలో బాగా విశాలంగా వున్న, మీ ఇంటిలో ఆయనకు విడిది ఏర్పాటు చేద్దామనివచ్చాం,'' అన్నారు.

ఇది విని జలజాక్షి తొట్రుపడుతూ, తండ్రికంటే ముందుగా, భటులతో, ''తొందరగా తీసుకురండి. పాపం జమీం





దారుగారికి గాయం ఎంత బాధ కలిగిస్తున్నదో ఏమో !'' అన్నది.

కొంతసేపటికి జమీందారు, నలుగురు సేవకులతో గుర్రం మీద వచ్చి, తన కోసం ప్రత్యేకంగా అలంకరించిన గదిలో విడిది చేశాడు. జలజాక్షి కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ, ''మిమ్ములను యీ స్థితిలో చూస్తూంటే, నాకు నరకంలో వున్నట్టున్నది.'' అన్నది.

ఆ రాత్రి ఆమె నిద్ర మాని, జమీందారుకు ఎంతగానో పరిచర్యలు చేసింది.

మర్నాటి సాయంకాలం వేళ, జమీందారు నౌకర్లు దివాణం నుంచి పెద్ద, పెద్ద పాత్రలలో మద్యం తీసుకు వచ్చారు. జలజాక్షి, జమీందారును, ''ఆ పాత్రలలో వున్నదేమిటి ?'' అని అడిగింది.

''హాయినిచ్చే మద్యం. అది సేవించక పోతే, రాత్రంతా జాగరణ చేయవలసిందే. నాకు నిద్రపట్టదు,'' అన్నాడు జమీందారు.

జలజాక్షి అసహ్యించుకుంటున్నట్టు ముఖంపెట్టి, చరచరా పెరట్లోకి వెళ్ళిపోయింది.

చీకటి పడ్డాక, విలువైన దుస్తులు ధరించిన ముగ్గురు వ్యక్తులు వచ్చారు. వాళ్ళూ, జమీందారూ తెల్లవారేదాకా పాచికలాడుతూ కాలం గడిపారు. పాచికలాటలో జమీందారు చాలా ధనాన్ని పోగొట్టుకోవడమే కాకుండా, పైగా వాళ్ళకు అప్పుపడ్డాడు.

ఆ ముగ్గురూ జమీందారు నుంచి గెలుచుకున్న ధనంతో వెళ్ళిపోయాక, దివాను ఆయనతో, ''ప్రభూ, మీరు అతిగా మద్యం సేవించి ఆరోగ్యాన్నీ, పాచికలాడి ధనాన్నీ పోగొట్టుకోవడం బాగా లేదు. ఇలా అయితే, తమ ఆరోగ్యం, జమీ ఎంతకాలం నిలిచేట్టు !'' అన్నాడు బాధపడుతూ.

''నిలిచినన్నాళ్ళే నిలవనివ్వండి. మనిషికి—అందునా నాబోటి జమీందారుకు అన్నిటికన్న వినోదం ముఖ్యం

గదా. చెప్ప మరిచాను. నాతో పాచిక లాడే మిత్రులకు చాలా పెద్ద మొత్తాలే బాకీ పడ్డాను. డబ్బు కావాలి. లోగడ భైరవ కొండల పక్కన వున్న గ్రామాల్లో నాలుగు గ్రామాలు అమ్మాం కదా. మరి, పది గ్రామాలమ్మి డబ్బు పట్టుకు రండి,'' అన్నాడు జమీందారు.

అతర్వాత ఆయన పెద్దగా మూలుగుతూ గుండె పట్టుకుని కుప్పకూలిపోయాడు. నౌకర్లు పరుగు పరుగునపోయి దివాణం వైద్యుణ్ణి తీసుకు వచ్చారు.

వైద్యుడు, జమీందారును పరీక్షించి, ఏదో కషాయంలాంటిది తాగించి, ''ప్రభూ, మీ ఆరోగ్యం పూర్తిగా దెబ్బతినిపోయింది. ఒక్క నెల రోజులపాటు మీకు చికిత్స చేయవలసి వున్నది. మీ రాకాలంలో దివాణం నుంచి కాలు బయట పెట్ట కూడదు,'' అన్నాడు.

కొద్ది సేపట్లో జమీందారు ప్రయాణానికి ఏర్పాట్లు జరిగినై. ఆయన బయలుదేర బోతూ, పెరట్లో నూతి దగ్గిర వున్న జలజాక్షి దగ్గిరకు వెళ్ళి, ''జలజాక్షీ! నీ అందం, నీవు నాకు చేసిన సేవా నన్నెంతో అనందపరిచాయి. దివాణం చేరాక తగిన ఏర్పాట్లు చేస కబురంపు తాను. నన్ను పెళ్ళాడడానికి, నీకెలాంటి అభ్యంతరం లేదుగదా?'' అని అడిగాడు.

అందుకు జలజాక్షి, ''క్షమించండి, ప్రభూ! ఒకప్పుడు మిమ్మల్ని పెళ్ళాడా లనుకున్న మాట నిజమే. ఇప్పుడు మీరంటే నాకు ఏవగింపు తప్ప మరేం లేదు. స్త్రీ కోరుకునేది లక్షణమైన భర్తను గాని, సవాలక్ష దురలవాట్లున్న భర్తను కాదు. మీరు పెద్ద జమీందార్లే కావచ్చు. కాని, మీకన్న మా సీతాపతి బావ వంద రెట్లు మేలు. ఈ అనుభవంతో, దూరపు కొండలు నునుపు అని తెలుసుకున్నాను,'' అన్నది.

జమీందారు తన ఎత్తు పారినందుకు చాలా సంతోషించి దివాణానికి వెళ్ళి పోయాడు. అ తర్వాత కొద్ది రోజులకు సీతా పతితో, జలజాక్షి వివాహం జరిగిపోయింది.





# బరువుకు తగ్గ న్యాయం

వేదపల్లి అగ్రహారంవాడైన పేరిశాస్త్రి గొప్ప వేదపండితుడు. ఆయన వద్ద ఎన్నో పురాతన గ్రంథాలున్నాయి. జాతి, మత, కుల విభేదాలతో ప్రపంచంలో ఎన్నో హత్యలు, ఎంతో రక్తపాతం జరుగుతూంటే, ఆయనకు బాధకలిగి, ఇతర మతాలకు సంబంధించిన ముఖ్యగ్రంథాలు కూడా సంపాదించి, వాటిని క్షుణ్ణంగా చదివాడాయన. అప్పుడాయనకొక అద్భుతమైన విషయం అవగాహన కొచ్చింది.

అదేమంటే—ఏ మతమూ హింసను బోధించదు. సర్వమానవ సమానత్వాన్ని శాసించి, లోకకళ్యాణాన్ని కోరుకుంటాయి మతాలన్నీ.

ఈ సత్యాన్ని ప్రజలముందు ఉపన్యాసంగా యిచ్చి, అప్పటికప్పుడు శ్రోతలు వెలిబుచ్చిన సందేహాలకు, వారి వారి మత గ్రంథాలనుంచే ఉదాహరణలిచ్చి, సందేహ నివృత్తి చేయాలనుకున్నాడు పేరిశాస్త్రి. ఇలా అనుకున్నదేతడవుగా ఆయన తన కార్యక్రమం ప్రారంభించాడు. అందుకోసం ముఖ్య గ్రంథాలన్నీ, ఒక కొయ్యపెట్టెనిండా సర్దాడు. దాన్ని మోయడానికి వీరయ్య అనే ఒక కూలీని పెట్టుకుని, దేశసంచారం ప్రారంభించాడు.

ఆరంభంలో పేరిశాస్త్రి ఉపన్యాసాలనెవరూ పట్టించుకోలేదు. కానీ ఏ మతస్థుడైనా ఒక సందేహం వెలిబుచ్చితే, అప్పటికప్పుడు అతడిముందే, అతడి మత గ్రంథాన్ని తీసి, అందులో ఉన్న వివరాలు చూపించి సందేహనివృత్తి కావిస్తున్న పేరిశాస్త్రి కొత్తపద్ధతి, ప్రజలపై క్రమంగా ప్రభావాన్ని చూపించసాగింది. ఫలితంగా ఎక్కడెక్కడినుంచో పేరిశాస్త్రికి ఆహ్వానాలు రాసాగాయి. చాలా సభల్లో పేరిశాస్త్రి తలపెట్టిన కార్యక్రమాన్ని అభినందిస్తూ

"వసుంధర"

కొందరు ధన, వస్తురూపేణా బహుమతులివ్వడం కూడా ఆరంభించారు.

ఇలా ఒక సంవత్సరం జరిగేసరికి, ఒక పెద్ద జమీందారు, అయనకు లక్ష రూపాయలు బహుమానంగా యిచ్చాడు. ఆ తర్వాత ఒక మాసం రోజులకు, ఆ ప్రాంతాన్నేలే రాజు, ఆయనకు రెండు లక్షలరూపాయల బహుమానంతోపాటు గొప్పగా సన్మానం కూడా జరిపాడు.

పేరిశాస్త్రి ఆర్థికంగా లాభపడడమేగాక, దేశదేశాంతరాల్లో అయన్ని గురించి గొప్పగా చెప్పుకోసాగారు. అయితే, పేరిశాస్త్రి గ్రంథాలున్నకొయ్యపెట్టెను మోసుకువచ్చే వీరయ్య క్రమంగా కృశించిపోసాగాడు. వాడి జబ్బేమిటో తెలియకపోయినా చివరకు పేరిశాస్త్రి, వాణ్ణి ఒక ధర్మవైద్యశాలలో చేర్పించాడు. అక్కడి వైద్యులు, వీరయ్యను పరీక్షచేసి వాడికి శారీరకంగా ఏ జబ్బూ లేదని తేల్చారు.

ఇది విని పేరిశాస్త్రి అశ్చర్యపడి, వీరయ్యను, "ఒరే, వీరయ్యా! నువ్వు బయటికి చెప్పకుండా, ఏదో మనస్సులో దాచుకుని బాధపడిపోతున్నావు. అదేమిటో చెప్పు." అని అడిగాడు.

వీరయ్య ఒక పట్టాన చెప్పలేదు. అఖరుకు పేరిశాస్త్రి బలవంతం మీదవాడు, "బాబూ, మీ మతగ్రంథాల బరువంతా, నేను మోస్తున్నాను. పేరూ, డబ్బూ మీకు వస్తున్నది. మీతో పోల్చుకుంటే, నాకు వచ్చిన లాభమేమున్నది?" అన్నాడు.



వాడిలో యింత బాధ వున్నదని, అప్పటివరకూ పేరిశాస్త్రికి తట్టనేలేదు. ఆయన ఆశ్చర్యపడి, వాడికి అర్థమయ్యేలా చెప్పాలనుకుని, "వీరయ్యా, నువ్వు గ్రంథాలున్న కొయ్యపెట్టెను బండిలో పెడతావు. అక్కడి నుంచి దాన్ని వేదిక మీదికి తెస్తావు. ఈ లెక్కన చూస్తే, నువ్వు రోజుకు రెండు గంటలకంటే దాన్ని మోయడం లేదు. అవునా?" అన్నాడు.

"అవును. కానీ మీరు కొత్తపద్ధతిలో చేస్తున్న ప్రచారానికి, నేను మోస్తున్న ఆ బరువేకదా పేరు, డబ్బు తెచ్చి పెడుతున్నది?" అన్నాడు వీరయ్య.

"నిజమే! ఈ పుస్తకాల బరువును రోజుకు రెండు గంటలపాటు తల మీద మోస్తున్నావు. నీకెప్పుడు బరువెక్కువనిపిస్తే అప్పుడు దించుకోగలవు కూడా. కానీ యీ పుస్తకాల బరువును, నేను నా తలలోపలి మెదడులో రోజంతా మోస్తున్నాను. ఆఖరుకు నిద్రలో కూడా, ఆ బరువు నేను మోయకతప్పదు. పైగా అది దించుకోలేని బరువు. దీన్నిబట్టి న్యాయం ఏమిటో నువ్వే చెప్పు," అన్నాడు పేరిశాస్త్రి.

పేరిశాస్త్రి ఎప్పుడెవరేమడిగినా, ఠకీమని ఒక పుస్తకం తీసి, ఏ పుటలో ఏముందో చెబుతాడని వీరయ్యకు తెలుసు. అందువల్ల వాడు వెంటనే, "నా తప్పు తెలిసింది, బాబూ! బరువు మోయడంలో మేధావిని, కూలివాడితో పోల్చాను. నన్ను మన్నించండి," అన్నాడు.

అయితే, పేరిశాస్త్రి అంతటితో ఊరుకోలేదు. ఆయన తన ఆదాయంలో వీరయ్యకు, మరి కాస్త ఎక్కువ భాగమివ్వడమే కాక, పదిమందిలోనూ సర్వమత సామరస్యాన్ని ప్రబోధించడానికి వీరయ్యచేస్తున్నసాయాన్నిపొగడసాగాడు.

వీరయ్య మనోవ్యాధి తగ్గిపోయింది. ఆ తర్వాత నుంచి వాడు, తల మీది నుంచి బరువు దించుకున్నప్పుడల్లా, "పాపం, నా యజమానికిలాంటి అవకాశం రాదుగదా!" అని జాలిపడుతూండేవాడు.






## 9

[వినోదుడు వింత జలపాతం దాటి వెళ్లాక, బంగారులోయ రాజ్యానికి ఒక మాంత్రికుడు వచ్చి, రాజు సమక్షంలో ఒక ఎలుగుబంటిని మనిషిగా మార్చి, అదేవిధంగా బంగారు విగ్రహాన్ని కూడా స్త్రీగా మార్చగలనని రాజును నమ్మించాడు. రాజూ, మంత్రీ, జ్ఞానులూ ఒక వారం పాటు ఉపవాసం వుండాలని షరతుపెట్టాడు. రాజు అందుకు అంగీకరించాడు. తరవాత—]

మర్నాడు ఉదయం రాజు మంత్రినీ, మహాజ్ఞానులనూ రప్పించి, ''మీరందరు కూడా మాతోపాటు ఒకవారం ఉపవాసం ఉండడానికి అనుమతిస్తున్నాం,'' అన్నాడు. ఆ క్షణం నుంచి వాళ్ళెవ్వరూ రాజభవనం వదిలి వెళ్ళకుండా కట్టడి చేశాడు.

ఒకరోజు గడిచేసరికి అందరూ ఆకలితో అలమటించి పోసాగారు. అయినా, ఎవరూ ఏమాత్రం బయటపడకుండా ఎంతో గంభీరంగా గడిపారు.

రాజు భోజన మందిరంలో మామూలుగా రాజుకు చేసే వంటకాలన్నిటినీ, మాంత్రికుడు సుష్టుగా భుజించసాగాడు. అతడు తినగా మిగిలినవాటిని, శిష్యుడు క్షణాలలో ఖాళీచేసేవాడు.

మూడవరోజుకల్లా రాజు చాలా నీరసించిపోయాడు. నాలగవరోజు మూలగడం

మనోజ్ దాస్



ప్రారంభించాడు. అప్పుడు గుక్కెడు పళ్ళ రసం మాత్రం తీసుకోవడానికి అనుమతించాడు మాంత్రికుడు.

అప్సరసను పెళ్ళాడిన తరవాత పట్టనున్న భోగభాగ్యాలను గురించి మాంత్రికుడు వర్ణించేప్పుడల్లా, రాజు చిన్నగా నవ్వేవాడు. ఆయన కళ్ళనుంచి బాష్పాలు రాలేవి. బంగారులోయ కొండలలో నిక్షిప్తంగా బంగారం ఉందన్న విషయం రాజుకు తెలుసు. విగ్రహానికి ప్రాణం వచ్చి తనను పెళ్ళాడితే, ఆ బంగారం అంతా ఎక్కడ ఉన్నదీ ఆమె తనకు చెప్పగలదన్న ఆశతో రాజు కాలం గడపసాగాడు!

ఎలాగో ఒకవిధంగా వారం రోజులు గడిచిపోయాయి. ఎనిమిదవరోజు వేకువజామున రాజును వెన్నతో స్నానం చేయించి, విలువైన దుస్తులు ధరింపజేసి, ఆభరణాలతో అలంకరించారు.

మాంత్రికుడు మంత్రినీ, మహాజ్ఞానులనూ పిలిచి, "ఇప్పుడు ప్రభువులవారిని నేను విగ్రహానికి అవలనున్న గుహలోపలికి తీసుకుపోవాలి. ఆయన అక్కడే తన ఉపవాసం విరమిస్తారు. మీరందరూ మీ మీ ఇళ్ళకు వెళ్ళి హాయిగా భోజనం చేయండి. నేను గుహలోపల ప్రవేశించి ధ్యానంలో కూర్చుంటాను. అలా ఎంత కాలం ఉంటానో నాకే తెలియదు. అయితే, ఈ మధ్యకాలంలో ఒక్క ప్రభువులవారు మాత్రమే నా దగ్గరికి రావడానికి అర్హులు. మరొక ముఖ్యమైన విషయం ఏమంటే ఈక్షణం నుంచి మీరు కూడా రాజుగారిని సమీపించకూడదని హెచ్చరిస్తున్నాను. నేను ప్రభువులవారిమీద మాయాశక్తిని ప్రయోగిస్తున్నాను. ఆ సమయంలో మీరు ప్రభువులవారిని సమీపించారంటే మీ ఆయువు క్షీణిస్తుంది!" అన్నాడు.

కొంతసేపటికి మంత్రి, మహాజ్ఞానులూ తమ తమ ఇళ్ళకు పరుగులు తీశారు. రాజుకు లేచి నిలబడడానికి కూడా శక్తి లేదు. ఆయన్ను భటులు మంచం మీద

పడుకోబెట్టి విగ్రహం వద్దకు మోసుకుపోయారు.

''తనకు తెలిసిన బంగారు నిధుల రహస్యాలతో ఈ అప్సరస ప్రభువులవారిని వివాహమాడడానికి ఒక్క రోజే ఉన్నది!'' అన్నాడు మాంత్రికుడు చిన్నగా నవ్వుతూ.

ఆ మాటలు వినగానే రాజు ఉత్సాహంతో, శక్తిని రాబట్టుకుని కూర్చుని, మాంత్రికుడి చేయి పట్టుకుని లేచినిలబడి, విగ్రహానికి వెనక ఉన్న గుహకేసి నెమ్మదిగా నడిచాడు. రాజుగారి అంగరక్షకులను సైతం, మాంత్రికుడు కొండ దిగువ ఉన్న మైదానంలోనే ఉండమన్నాడు.

''ఆ బంగారు విగ్రహాన్నే మింగేద్దామా అన్నంత ఆకలితో ఉన్నాను. అయినా, ఆమెను నేను పెళ్ళాడాలికదా,'' అన్నాడు రాజు మాంత్రికుడితో.

రాజూ, మాంత్రికుడూ గుహలో ప్రవేశించే లోపల, సేవకులు మామూలుగా రాజు భుజించే రకరకాల వంటకాలను అక్కడికి చేర్చారు. మాంత్రికుడి శిష్యుడు చెప్పినప్రకారం పళ్ళాలను అమర్చి, అక్కడి నుంచి వాళ్ళు వెళ్ళిపోయారు. పళ్ళాలనిండుగా ఉన్న పదార్థాలను చూసి రాజు పరమానందం చెందాడు. ఆయన ముఖం కొత్త కాంతితో వెలిగిపోయింది. ''ఆహా! నేనిప్పుడు తినవచ్చు కదా?'' అని అరిచాడు రాజు.

''తొందరపడకండి మహారాజా, పూజలో ముఖ్యమైన తతంగం ఇప్పుడే జరగాలి.





అదిగో, గోడ మధ్యగా ఉన్న బిలం మీకు కనిపిస్తున్నదా ప్రభూ! మీరు మోకాళ్ళ మీదికి వంగి పాకుతూ ఆ బిలంగుండా అవతలికి వెళ్ళి నేను చెప్పినట్టు చేయండి. అది చాలా సులభం. ఆ తరవాత మీరు ఇష్టానుసారం తినవచ్చు. ఆ పైన....'' అని మాంత్రికుడు ఏదో చెప్పబోయేంతలో, ''అప్సరసను వివాహమాడవచ్చు,'' అన్నాడు రాజు ఎంతో ఉత్సాహంతో.

''అవును ప్రభూ! ఇప్పుడు మీరు మీ బట్టలు తీసి పక్కగా పెట్టి ఆ బిలంలో ప్రవేశించండి,'' అన్నాడు మాంత్రికుడు.

''నేను బట్టలెందుకు విప్పాలి?'' అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

''అది ఈ పూజలో ఒక భాగం మహా ప్రభూ! మీకు త్వరలో పట్టనున్న అదృష్టాన్ని మరిచిపోకండి. అటువంటి మహద్భాగ్యం కోసం బట్టల్నే కాదు; నా చర్మాన్ని వొలిచి ఇవ్వమన్నా నేను వెనుకాడను!'' అన్నాడు మాంత్రికుడు.

వేరే మార్గం కనిపించక రాజు అందుకు అంగీకరించాడు. మాంత్రికుడూ, శిష్యుడూ రత్నాలు తాపిన రాజుగారి చొక్కానూ, మణులుపొదిగిన తలపాగానూ, బంగారపు టంచు పంచెనూ ఒక్కొక్కటిగా విప్పారు. కంఠహారాలూ, ఉంగరాలూ మొదలైన ఆభరణాలన్నిటినీ తీసుకున్నారు.

ఆ తరవాత ఇరువురూ కలిసి, రాజును పట్టి బిలం లోపలికి నెట్టారు. ''కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటిగా ఉన్నది,'' అని గొణిగాడు రాజు.

''కొంతకాలానికి అదే నీకు అలవాటై పోతుందిలే,'' అన్నాడు మాంత్రికుడు.

''ఇక్కడే అలవాటుపడాలని మేము కోరడం లేదు. త్వరగా నీ పూజా తతంగం పూర్తిచెయ్,'' అని అరిచాడు రాజు.

మాంత్రికుడు క్షణాల్లో, అతికించుకున్న గడ్డాన్ని లాగి అవతలపారేసి, రాజు దుస్తులూ, ఆభరణాలూ ధరించి, తలపాగా పెట్టుకుని, ''పూజాతతంగం పూర్తయింది!'' అన్నాడు గట్టిగా నవ్వుతూ.

''నాకు ఆకలేస్తున్నది. ఆ పళ్ళాలను అందివ్వు.'' అని అరిచాడు రాజు.

మాంత్రికుడు బిలంగుండా తొంగి చూశాడు. అతణ్ణి చూసి రాజు ఆశ్చర్యంతో, ''ఎవరు నువ్వు?'' అని అడిగాడు.

''చండమార్తాండ మహాప్రభువును!'' అన్నాడు మాంత్రికుడు.

''అర్థరహితంగా మాట్లాడకు. నువ్వు రాజువయితే, మరి నేనెవర్ని?'' అన్నాడు రాజు.

''మాంత్రికుడివై వుంటావు!'' అన్నాడు రాజు వేషంలోని మాంత్రికుడు.



''నాకు మంత్రతంత్రాలు తెలియవు. తెలిసుంటే ఈ పాటికి ఈ గుంట్రాళ్ళను లడ్డూలుగా మార్చి ఉండేవాణ్ణి కదా!'' అన్నాడు రాజు.

''మరిచిపోయి వుంటావు. రాజభవనంలో నిధి నిక్షేపాలు దాచే భోషాణం తాళంచెవి ఎక్కడపెట్టానో నేను మరిచిపోయాను. అలాగే నువ్వు కూడా మంత్రతంత్రాలు మరిచిపోయి వుంటావు. ఆ తాళంచెవి ఎక్కడున్నదో చెప్పు. చెప్పావంటే నీకు ఇష్టమైన ఆహారపానీయాలూ, వెలుతురూ లభించేట్టు చేస్తాను.'' అన్నాడు మాంత్రికుడు.

''నేను చెప్పను. నీ మోసం తెలిసిపోయింది. కదలలేనంత నీరసం వచ్చేవరకు నన్ను పస్తువుంచి, మోసం చేస్తావా. నీచుడా!'' అని అరిచాడు రాజు.

శిష్యుడు పళ్ళాన్ని పట్టుకున్నాడు. రాజు వేషంలోని మాంత్రికుడు అందులోని వంటకాలను తినసాగాడు.

''నా ఆహారం నాకివ్వరా,'' అని అరిచాడు రాజు కోపంగా.

మాంత్రికుడు రాజుకు ఒక లడ్డూ ఇచ్చి, ''నువ్వు భోషాణం తాళంచెవి వున్నచోటు చెప్పేంతవరకు, నీకు రోజుకు ఒక లడ్డూమాత్రమే!'' అన్నాడు.

''ఆ రహస్యం చెప్పానంటే, ఒక్క లడ్డూ కూడా ఇవ్వకుండా నన్ను చంపగలవు. నేనెంత మూర్ఖుణ్ణి! నిన్ను



ఆ కొండలను దాటి వెళ్ళక తప్పదు.'' అన్నాడు ముని వినోదుడితో.

''అదృశ్యమయ్యే రహస్యం నాకు తెలుసు. జ్ఞానభూమి రాజు ఆ రహస్యం నాకు ఉపదేశించాడు. ఇక్కడ అదృశ్యమై ఆ కొండలు దాటి ప్రత్యక్షం కాగలను!'' అన్నాడు వినోదుడు.

''ఆ విద్య మానవప్రపంచం వరకే పరిమితం. నువ్విప్పుడు ప్రవేశించనున్నది మానవప్రపంచం కాదు. అక్కడివాళ్ళు మనుషులు లాగా కనిపించినప్పటికీ మానవులు కారు.'' అన్నాడు ముని.

''అయితే, అక్కడికి కాలినడకనే వెళతాను.'' అన్నాడు వినోదుడు.

''అది కూడా సాధ్యమయ్యే పనికాదు. ఎందుకంటే, నువ్వు ఎంతకాలం నడిచినా ఈ అరణ్యాన్ని దాటలేవు. అక్కడివారిని చేరుకోవాలంటే రహస్యమార్గంగుండా వెళ్ళాలి.'' అన్నాడు ముని.

''మహాత్మా! ఇటువంటి పరిస్థితిలో మీరుతప్ప నాకెవ్వరూ సహాయం చేయలేరు. కరుణించి మీరే నన్ను అక్కడికి చేర్చాలి.'' అన్నాడు వినోదుడు మునికి నమస్కరిస్తూ.

''అలాగే,'' అని, ముని చిరునవ్వు నవ్వి, వినోదుడి చేయి పట్టుకుని కొండల కేసి నడవసాగాడు.

నమ్మానే,'' అని గొణుక్కుంటూ, లడ్డూను తినసాగాడు రాజు.

* * *

వింతపుచ్చకాయ బద్దలై పడటంతో, విచారగ్రస్తులైన పట్టణప్రజలను వదలి—మునీ, వినోదుడూ ఒక అరణ్యప్రాంతాన్ని చేరారు.

''అదిగో, నింగీనేలా కలుస్తున్న దూర తీరంలో నీలిరంగు కొండలు కనిపిస్తున్నవి కదా! వాటిని దాటి వెళ్ళడం చాలా కష్టం. అయితే—మీ రాజ్యంలోని బంగారు స్త్రీ విగ్రహానికి ప్రాణం వచ్చే రహస్యం తెలుసుకోవడానికి, నువ్వు సాగిస్తూన్న ఈ ప్రయాణంలో విజయం సాధించాలంటే,

వినోదుడికి ఒక్క క్షణం మైకం కమ్మి నట్టయింది. మరుక్షణం అతనికి పక్షి ఈకలా తేలిగ్గా ఎగిరిపోతున్నట్టు అనిపించింది. అతని మనసులో ఎటువంటి చలనమూ లేకుండా ప్రశాంతంగా తోచింది. హాయిగా కళ్ళు మూసుకున్నాడు.

ఇలా ఎంతసేపు ముని వెంట నడిచినదీ వినోదుడికి తెలియలేదు. ఎవరో మెల్లగా వెన్నుపై చరిచినట్టయి, కళ్ళు తెరిచాడు. వినోదుడు చిన్న కొండపై ఒక బండమీద ముని సమీపంలో కూర్చుని ఉన్నాడు. అప్పుడప్పుడే తెల్లవారుతున్నది. తూర్పు ఆకాశపు మేఘాలు సముద్రపు నురగలాగా ఆ ప్రాంతాలకు వింత అందాలను సమకూరుస్తున్నవి.

కొండ దిగువ మైదానంలో కొన్ని వృక్షాలు కనిపించాయి. వాటి బోదెలు తాటి బోదెల్లా వున్నాయి. కాని కొమ్మలూ, రెమ్మలూ కనిపించడం లేదు. అవి మేఘాల మధ్యగా దూసుకుపోయి, ఆకాశాన్ని అంటుతున్నవి.

"ఇంత ఎత్తయిన వృక్షాలను నేనెప్పుడూ చూడలేదు!" అన్నాడు వినోదుడు.

"అవి ఎప్పుడూ అంత ఎత్తు వుండవు. ప్రాతఃకాలంలో కొంతసేపు మాత్రమే. ఆకాశంలో దేవకుమారులు మధురఫలాలు అందుకోవడానికి అనువుగా అంత ఎత్తుకు ఎదుగుతాయి," అన్నాడు ముని.

వినోదుడు మళ్ళీ మైదానం కేసి చూశాడు. అప్పటికే ఆ వృక్షాలు మామూలు ఎత్తుకు వస్తూ వుండడం గమనించి, "ఇదొక అద్భుతమైన ప్రపంచం!" అన్నాడు వినోదుడు.

"మనం ఇప్పుడు మానవలోకం సరిహద్దులలో ఉన్నాము. ఉత్తమమైన జీవనం సాగించేవారు ఇక్కడ నివసిస్తున్నారు. త్వరలో వాళ్ళలో కొందరిని నువ్వు చూడగలవు," అన్నాడు ముని.

ఇంతలో ఒక కీచుకంఠస్వరం వినిపించింది. వినోదుడు వెనుకకు తిరిగి, అక్కడి దృశ్యం చూసి, భయాశ్చర్యాలతో నిలబడిపోయాడు. —(ఇంకావుంది)






# నందినినవ్వు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, చేపట్టినకార్యం సాధించి తీరాలన్న పట్టుదలతో, ఈ అర్ధరాత్రివేళ అమావాస్య చీకట్లో, భీతిగొల్పే శ్మశానంలో, నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నాకు ఆశ్చర్యం కలుగుతున్నది. పట్టుదలతో సాధించరాని కార్యం లేదన్న మాటలో కొంత సత్యం లేకపోలేదు. కాని, కొందరు మనుషులు కార్యం సానుకూలమయ్యే దశలో ఉన్నట్టుండి భీరుత్వంవల్లనో, మనోదౌర్బల్యకారణంగానో, దాన్ని చేజేతులా జారవిడుచుకుంటారు. ఇందుకు ఉదాహరణగా నీకు, శరశ్చంద్రికరాజు విక్రమసింహుడి కథ చెబు

## బేతాళ కథలు



తాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

అశ్వపురి యువరాణి నందిని అద్భుతమైన సౌందర్యరాశి. ఆమెను వివాహమాడడానికి, అనేకమంది రాజకుమారులు ఉవ్విళ్ళూరసాగారు. అయితే, నందిని విజయపురి యువరాజైన వసంతసేనుడిని వివాహమాడదలచింది. దానికి కారణం వసంతసేనుడు అందగాడేకాదు, మహావీరుడు కూడా.

నందిని తన తండ్రి కీర్తికాంతుడితో, తన మనసులోని మాట చెప్పింది. రాజు అది విని ఆలోచనలోపడ్డాడు. నందినిని వివాహమాడాలని, అనేక రాజ్యాల రాకుమారులు కలలుకంటున్నారు. వాళ్ళందరినీ కాదని, చిన్న రాజ్యమైన విజయపురితో వియ్యమందితే, మిగిలిన రాజులు కయ్యానికి కాలుదువ్వవచ్చు. అందువల్ల, నందినికి స్వయంవరం ప్రకటించడం క్షేమమని, కీర్తికాంతుడు నిర్ణయించాడు.

అలాంటి తరుణంలో, ఒకనాడు నందిని వనవిహారానికి, రథం మీద బయలుదేరింది. అయితే, చెలికత్తెలు యింకా రథం ఎక్కకముందే, పక్కనున్న గజశాలలోని ఏనుగుల ఘీంకారాలు విని, రథాశ్వాలు బెదిరి, నందినితోపాటు ఒక కీకారణ్యానికి పరుగుతీశాయి.

ఆ అరణ్యంలో వున్న ప్రతాపుడనే గజదొంగ, అది చూసి తన గుర్రం మీద రథాన్ని సమీపించి, లాఘవంగా నందినిని రథం మీది నుంచి కిందికి దించాడు.

తనను కాపాడిన గజదొంగకు నందిని, తన కృతజ్ఞతలు చెప్పుకుని, ''ఎవరు నీవు? ఈ కీకారణ్యంలో ఎందుకుంటున్నావు?'' అని అడిగింది.

అందుకు ప్రతాపుడు, ''సుందరీ! నేను ప్రతాపుడనే గజదొంగను. నీ సౌందర్యం చూసి నా కళ్ళు చెదురుతున్నవి. నీకభ్యంతరం లేకపోతే, నిన్ను పెళ్ళాడతాను. తర్వాత ఈ దొంగజీవితాన్ని వదిలి, సన్మార్గాన నడుస్తాను,'' అన్నాడు.

గజదొంగ కోర్కెకు నందిని ఆశ్చర్యపోయి, "నేను అశ్వపురి యువరాణిని. నీతో వివాహం నాకిష్టం లేదు. కావాలంటే, నా ఒంటి మీద వున్న నగలన్నీ సంతోషంగా వలిచి యిస్తాను. అవి తీసుకుని నీ దారిన పో," అన్నది.

ఆ జవాబు విని ప్రతాపుడు ఎంతో వినయంగా, "యువరాణీ, మిమ్మల్ని క్షేమంగా, రాజధానీనగరం చేరుస్తాను, రండి!" అన్నాడు.

నందిని ఎంతగానో సంతోషించి, ప్రతాపుడి వెంట బయలుదేరింది. వాళ్ళు కొంతదూరం వెళ్ళేసరికి, వెనుకనుంచి భూమి దద్దరిల్లేలా అడుగుల చప్పుడు వినిపించింది. నందిని భయభ్రాంతురాలైంది. గజదొంగ ప్రతాపుడు తిరిగి చూడకుండా పారిపోయాడు.

లంబకర్ణు డనే రాక్షసుడు, నందినిని సమీపించి, "ఔరా, ఏమి సౌందర్యం! నీ అందం రాక్షసుడినైన నాకే మతి పోగొడుతున్నది," అన్నాడు.

ఆ మాటలకు నందిని తొణక్కుండా, "నేను అశ్వపురి యువరాణిని. దురదృష్ట వశాత్తూ, కీకారణ్యం చేరాను," అన్నది.

"నీ దురదృష్టం, నా అదృష్టం యువరాణీ! నిన్ను పెళ్ళాడదలిచాను. నా భీకరాకారం చూసి భీతి చెందకు. నాకున్న కామరూపశక్తులవల్ల, నేను కోరినరూపం ధరించగలను. నువ్వు, నన్ను పెళ్ళాడితే, యీ దాపులనున్న రాజ్యాలనన్నిటినీ






డనే అతను కళ్ళు మూసుకుని ధ్యానం చేస్తున్నాడు. అతణ్ణి, ఆశ్రయిస్తే, తప్పక తనను నగరానికి చేర్చగలడన్న నమ్మకం కలిగింది, నందినికి.

కొద్దిసేపటి తర్వాత గోవర్ధనుడు కళ్ళు తెరిచి నందిని కేసి చూశాడు. ఆమె సౌందర్యానికి అతడి కళ్ళు చెదిరాయి.

అతడు నందినిని, "సౌందర్యరాశీ! నువ్వెవరివి ?" అని అడిగాడు.

నందిని, అతడికి జరిగినదంతా చెప్పి, తనను రాజధానీనగరం చేర్చమని కోరింది.

"యువరాణీ, నేను అవనికరాజు గోవర్ధనుణ్ణి. జీవితం మీద విరక్తి చెంది సన్యసించాను. నిన్ను చూస్తూంటే మరలా జీవితం మీద మమకారం కలుగుతున్నది. నువ్వు సమ్మతిస్తే, నిన్ను వివాహమాడి, తిరిగి రాజ్యాధిపత్యం వహించదలిచాను," అన్నాడు.

ఆ మాటలకు నందిని, "స్వామీ, మీ కోరిక మన్నించనందుకు క్షమించండి. తప్పనిసరైతే, నేను సన్యాసినిని అవగలను కాని, మిమ్మల్ని వివాహమాడలేను," అని జవాబిచ్చింది.

"క్షమించు, యువరాణీ! ఈ రోజుకు యిక్కడ విశ్రాంతి తీసుకో. రేపు ఉదయమే, మీ నగరానికి ప్రయాణమవుదాం," అన్నాడు గోవర్ధనుడు.

జయించి, నిన్ను మహారాణిని చేస్తాను," అంటూ ఒక అందమైన యువకుడుగా మారిపోయాడు.

"రాక్షసా, నిన్ను పెళ్ళాడలేను. కావాలంటే, యీ క్షణమే నన్ను చంపితిను," అన్నది నందిని.

రాక్షసుడు దీనంగా ముఖం పెట్టి, "నీవు, నన్ను పెళ్ళాడడానికి యిష్టపడకపోతే, అది నా దురదృష్టమనుకుంటాను గాని, నీవంటి అందగత్తెను చంపను," అన్నాడు.

నందిని అక్కడి నుంచి బయలుదేరి కొంత దూరం వెళ్ళేసరికి, ఒక చిన్న కుటీరం ముందున్న చెట్టుకింద, గోవర్ధను

అంతలో గుర్రపుడెక్కల చప్పుడు వినిపించింది. విలువైన దుస్తులు ధరించిన యువకుడొకడు అక్కడికి వచ్చి గుర్రం దిగి, గోవర్ధనుడికి నమస్కరించి, "స్వామీ, నేను శరశ్చంద్రిక రాజు విక్రమసింహుణ్ణి. వేటాడి అలసిపోయి దప్పికతో యిటు వచ్చాను. కొంచెం నీరిప్పించండి,'' అని అడిగాడు.

అంతలో విక్రమసింహుడి దృష్టి, నందినిపై పడింది. అతడు ఆశ్చర్యపోతూ, ''నీవు అశ్వపురి యువరాణి నందినివి కదా !'' అన్నాడు.

నందిని అవునన్నట్టు తలపంకించింది. విక్రమసింహుడు సంతోషంగా, ''నిన్నిక్కడ చూడడం, నా అదృష్టం. అయినా, నువు ఇక్కడికెందుకు వచ్చావు ?'' అని ప్రశ్నించాడు.

నందిని జరిగినదంతా వివరంగా చెప్పింది. విక్రమసింహుడు, ఆమెతో, ''నిన్ను, మీ రాజధానీనగరం చేర్చే బాధ్యత నాది,'' అని గోవర్ధనుడిచ్చిన నీరుతాగి, ''స్వామీ, యీమెను క్షేమంగా రాజ్యం చేరుస్తాను,'' అని నందినిని గుర్రం మీద ఎక్కించుకుని, తన రాజధానికి తీసుకుపోయాడు.

అక్కడ విక్రమసింహుడు, నందినిని తన ప్రత్యేకమందిరంలోకి నడిపించాడు. ఒకచోట నిలువెత్తు నందిని చిత్రపటం వున్నది. అది చూసి నందిని ఆశ్చర్యపోయింది.





అది గమనించిన విక్రమసింహుడు, "నందినీ, నిన్ను వివాహమాడాలని ఎంత కాలంగానో కలలు కంటున్నాను. ఈ విషయమై, మీ నాన్నగారికి లేఖ కూడా పంపాను. నువ్వు, కాదంటే యుద్ధంలో, మీ నాన్నను ఓడించి అయినా, నిన్ను వివాహమాడతాను," అన్నాడు.

అందుకు నందిని, "మహారాజా, వివాహ విషయంలో నన్ను బలవంతం చేయకండి. నేను విజయపురి యువరాజు వసంతసేనుణ్ణి మనసారా ప్రేమించాను," అన్నది.

విక్రమసింహుడు, ఆ జవాబుకు ఉగ్రుడైపోయి, "నందినీ, నిన్ను వదలను, రాక్షసంగానైనా నిన్ను వివాహమాడి తీరుతాను!" అన్నాడు.

ఆ మాటలకు నందిని పకపకమంటూ నవ్వసాగింది.

విక్రమసింహుడు ఆశ్చర్యంగా, "ఎందుకలా నవ్వుతున్నావు?" అని అడిగాడు.

"ఆ సంగతి, నీకనవసరం. నన్ను బలవంతంగా వివాహమాడదలిస్తే, ముందుగా ఒక పని చెయ్యి. అరణ్యంలో నాకు తారసపడిన గజదొంగ ప్రతాపుణ్ణీ, లంబకర్ణుడనే రాక్షసుణ్ణీ, సన్యసించిన గోవర్ధనుణ్ణీ యిక్కడకు పిలిపించు. గజదొంగనూ, రాక్షసుణ్ణీ ఘనంగా సన్మానించి, గోవర్ధనుణ్ణి కఠినంగా శిక్షించు. ఆ తర్వాత నన్ను వివాహమాడు," అన్నది నందిని.

విక్రమసింహుడు ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, తర్వాత, "నందినీ, నన్ను క్షమించు! నిన్నిప్పుడే నీ రాజ్యం చేర్పించే ఏర్పాట్లు చేస్తాను," అన్నాడు.

కొద్దిసేపటి తర్వాత విక్రమసింహుడు, నందినిని విలువైన కానుకలతో అశ్వపురికి సాగనంపాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విక్రమసింహుడు తనను వివాహమాడే ముందు నందిని, గజదొంగనూ, రాక్షసుణ్ణీ

సన్మానించి, సన్యాసిని ఎందుకు శిక్షించమన్నది? తాను ఎంతగానో కోరినస్త్రీ చేజిక్కినా విక్రమసింహుడు ఎందుకు వివాహమాడకుండా వదిలిపెట్టాడు? ఇందుకు భీరుత్వం, మనోదౌర్బల్యాల్లాంటివి కారణాలా? అసలు నందిని అంతగా నవ్వడానికి హేతువేమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నందిని నవ్వడానికి చాలా ముఖ్యకారణమే వున్నది. తాను వసంతసేనుడనే యువరాజును ప్రేమించి వివాహమాడదలచినట్టు చెప్పగానే, గజదొంగా, రాక్షసుడూ, సన్యాసి కూడా—ఆమెను బలవంతపెట్టకపోగా, క్షమించవలసిందిగా కోరారు. కాని, ఒక రాజ్యాన్నేలే రాజు విక్రమసింహుడు మాత్రం, ఆమెను బలవంతంగా రాక్షస రీతిలో వివాహమాడదలిచాడు. అందుకే నందిని పకపకా నవ్వింది. ఆ విధంగా—దొంగా, రాక్షసుడూ, సన్యాసికన్నా నువ్వు నీచుడివి, అన్న భావం ఆమె బయటపెట్టింది. అది గ్రహించిన విక్రమసింహుడు వెంటనే తన బుద్ధి మార్చుకున్నాడు. అది అతడిలో వున్న నీతి నియమాలపట్లగల భక్తిశ్రద్ధలను బయటపెడుతుంది గాని, భీరుత్వాన్నీ, మనోదౌర్బల్యాన్నీ మాత్రం కాదు.

దొంగనూ, రాక్షసుణ్ణీ సన్మానించి, సన్యాసిని శిక్షించమనడం ద్వారా నందిని చెప్పదలచుకున్నదేమంటే—వాళ్ళు మర్యాదగా ఆమెను తన దారిన తనను పోనిచ్చారు. సన్యాసి అలా కాక, ఏమాత్రం పరిచయం లేని ఒక రాజుకు ఆమెను అప్పగించాడు. ఆ కారణంగా నందిని చిక్కులపాలయింది. అందుకే ఆమె సన్యాసిని శిక్షించమని విక్రమసింహుణ్ణి కోరింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ప్రయోజనం

జమీందారు వీరభద్రగజపతి దగ్గిరకు, కోయవాడొకడు వచ్చి, వనమూలికలంటూ కొన్ని వేళ్ళూ, ఆకులూ ఆయనకిచ్చి, "దేవరా! పాపికొండల్లో తప్ప, మరెక్కడా దొరకని వీటిని కషాయం చేసి తాగారంటే, శరీరంలో వున్న రుగ్మతలన్నీ చేతితో తీసిపారేసినట్టు పోతాయి," అని చెప్పాడు.

జమీందారు, దివానును పిలిచి, కోయవాడికి వందవరహాలు బహుమానంగా యిచ్చి పంపమన్నాడు.

అందుకు దివాను, "అంత పెద్ద బహుమానం యిచ్చేముందు, యీ మూలికల్ని మన రాజవైద్యుడికి చూపించడం మంచిదేమో!" అన్నాడు.

జమీందారు, రాజవైద్యుడు రంగాచారికి కబురు చేశాడు. ఆయన వచ్చి మూలికలను పరీక్షించి, "ఈ మూలికలవల్ల ప్రయోజనం ఏమైనా వుంటే—అది మీకు మాత్రం కాదు!" అన్నాడు.

జమీందారు చిరాకుగా, "ఆ ప్రయోజనం ఏదైనా నాకు కాక, ఆ కోయవాడికా?" అన్నాడు.

రంగాచారి చిరునవ్వు నవ్వి, "సత్యం పలికారు, ప్రభూ! అడవుల్లో ఎక్కడపడితే అక్కడ వుండే ఆకుల్నీ, వేళ్ళనూ తెచ్చి, మూలికలంటూ వంద వరహాలు పట్టుకుపోగలిగితే, ఆ ప్రయోజనం తమకా? కోయవాడికా?" అన్నాడు.

చమత్కారంగా నిజాన్ని బైటపెట్టినందుకు, జమీందారు, వైద్యుణ్ణి మెచ్చుకుంటూంటే, కోయవాడు ఎలా వచ్చాడో, అలాగే అక్కణ్ణించి చల్లగా జారుకున్నాడు.

— కమలిని



కావ్యకథలు :

# రాక్షసముద్రిక-3



మగధ రాజ్య పాలకులైన నందులచేత అవమానించబడిన చాణక్యుడి సహాయంతో, చంద్రగుప్తుడు నందులను ఓడించి మగధ సింహాసనాన్ని అధిరోహించాడు. చాణక్యుడు, అతని మంత్రి అయ్యాడు. తమకు సైనిక సహాయం చేసిన పర్వతకుణ్ణి చాణక్యుడు తంత్రంగా హతమార్చాడు.

నందులు ఓడిపోవడంతో, వాళ్ళ విశ్వాసానికి పాత్రుడైన మంత్రి రాక్షసుడు—తన కుటుంబాన్ని, తన మిత్రుడూ, ప్రముఖ నగల వ్యాపారీ అయిన చందనదాసుకు అప్పగించి, పాటలీపుత్రాన్ని వదిలిపెట్టాడు.





చాణక్యుడి కుట్రకు బలియైపోయిన పర్వతకుడి కుమారుడు—మలయకేతుడు. మంత్రి రాక్షసుడు తిన్నగా మలయకేతుడి వద్దకు వెళ్ళి అతని మైత్రి సంపాయించాడు.



నందుల వంశాన్ని నాశనం చేసిన చంద్రగుప్త చాణక్యుల మీద పగ సాధించడానికి రాక్షసుడు పూనుకున్నాడు. అందుకోసం ఇరుగు పొరుగు రాజుల సహాయాన్ని సమకూర్చుకోవడానికి అతడు ప్రయత్నించసాగాడు.

రాక్షసుడి ప్రయత్నాలను, చాణక్యుడు చారుల ద్వారా గ్రహించాడు. రాక్షసుడి తెలివితేటలూ, రాజభక్తి చాణక్యుడికి బాగా తెలుసు. అందువల్ల రాక్షసుణ్ణి తమవైపుకు తిప్పుకుంటే తప్ప తమ రాజ్యానికి శాంతి వుండదని భావించి, దానికోసం పథకం ఆలోచించాడు.





చాణక్యుడు, నగల వ్యాపారి అయిన చందనదాసును రప్పించి, "నువు రాజద్రోహం చేశావు," అన్నాడు. "రాజుకు వ్యతిరేకంగా నేనే నేరమూ చేయలేదే!" అన్నాడు చందనదాసు. "రాజుగారి శత్రువైన రాక్షసుడి కుటుంబానికి నీ యింట ఆశ్రయం ఇవ్వడం రాజద్రోహం కాదా?" అని అడిగాడు చాణక్యుడు.

"నా మిత్రుడి భార్యాబిడ్డలు ఆపదలో వున్నప్పుడు ఆదుకోమంటే ఆశ్రయం ఇవ్వకుండా ఎలా వుండగలను?" అన్నాడు చందనదాసు. చాణక్యుడు అతని మంచి గుణానికి లోలోపల మెచ్చుకున్నా, "అదే రాజద్రోహం అంటున్నాను. అందుకే నిన్ను ఖైదు చేయిస్తున్నాను," అని అతన్ని బంధించమని భటులకు ఆజ్ఞాపించాడు.





ఒకనాడు చాణక్యుడు చంద్రగుప్తుడితో, "రాజా, మనం ఏవిధంగానైనా మలయకేతు—రాక్షసుల మధ్య స్నేహాన్ని చెడగొట్టి, రాక్షసుణ్ణి మన పక్షానికి తెచ్చుకోవాలి. అందుకు మనమొక చిన్న నాటకం ఆడాలి. మనిద్దరి మధ్యా అభిప్రాయ భేదాలు వున్నట్టు బయటివారు అనుకునేలా చేయాలి!" అన్నాడు.

చంద్రగుప్తుడు అందుకు అంగీకరించాడు. ఇరువురూ కలిసి ఒక పథకం వేశారు. ఆ పథకం ప్రకారం—వసంత ఋతువు ఆగమనాన్ని పురస్కరించుకుని నగరమంతటా గొప్ప ఉత్సవం జరుగగలదని రాజు చాటింపు వేయించాడు.





చాణక్యుడు, నగర ద్వారతోరణాలను అలంకరిస్తున్న స్థలానికి వచ్చి, "ఆపండి ఈ అలంకరణలన్నీ. ఉత్సవమూ లేదూ, ఏదీ లేదు. వెళ్ళండి; ఇది నా ఆజ్ఞ," అంటూ కోపావేశంతో అరిచాడు. అతని ప్రవర్తనకు అక్కడి వారు అమితాశ్చర్యం చెందారు.

ఈ విషయాన్ని ప్రజలు చంద్రగుప్తుడికి నివేదించారు. ఆయన చాణక్యుణ్ణి సభకు రప్పించి సంజాయిషీ అడిగాడు. "మలయకేతూ, రాక్షసుడూ కలిసి మన మీద దాడి జరపడానికి ఆయత్తమవుతున్నారు. ఈ సమయంలో ఉత్సవాలు అవసరం లేదు!" అన్నాడు చాణక్యుడు కోపంగా.





ఇరువురి మధ్యా కొంతసేపు వివాదం జరిగింది. ఉన్నట్టుండి చంద్రగుప్తుడు చాణక్యుడితో, "నీకన్నా రాక్షసుడు చాలా తెలివైనవాడు!" అన్నాడు. "అలాగా! అయితే ఈ క్షణం నుంచి నేను మంత్రి పదవిని వదులుకుంటున్నాను," అంటూ చాణక్యుడు కోపావేశంతో సభనుంచి వెళ్ళిపోయాడు.

—(ముగింపు వచ్చేసంచికలో)




# వైద్యంలో లౌక్యం

సుమేరుపురంలో, విశ్వపతి అనే గొప్ప వైద్యుడుండేవాడు. ఆయన దగ్గిర అనంతుడు, నీలకంతుడు అనే యువకులిద్దరు శిష్యరికం చేస్తూండేవారు.

అనంతుడు మంచి గ్రహణ, ధారణ శక్తులున్నవాడు. చరకుడు, శుశ్రుతుడు లాంటి మహామేధావులు వైద్యశాస్త్రాల్లో రాసినదంతా, గుక్కతిరక్కుండా అప్ప చెబుతూ, విశ్వపతిని ఆశ్చర్యపరుస్తూండేవాడు. విశ్వపతి అతడి తెలివితేటలను మెచ్చుకుంటూ, తనను మించిన గొప్ప వైద్యుడు కాగలడని అనుకునేవాడు.

నీలకంతుడు మాత్రం సామాన్యమైన తెలివితేటలున్నవాడు. కాని, అతడు గురువును అన్ని వేళలా అనుసరిస్తూ, ఆయన రోగులను పరీక్షించే తీరు జాగ్రత్తగా గమనిస్తూండేవాడు. అతడికి వైద్యానికి సంబంధించిన నాలుగు మెళుకువలేవో ఒంటపడితే చాలనీ, ఏదో విధంగా పొట్టపోషించుకోగలడనీ, విశ్వపతి అతణ్ణి గురించి అట్టే పట్టించుకునేవాడు కాదు.

కొంతకాలం అయ్యాక అనంతుడూ, నీలకంతుడూ విశ్వపతి దగ్గిర తమ చదువు పూర్తి చేసుకుని, స్వస్థలమైన స్వర్ణపురం సంస్థానం చేరుకుని, అక్కడ విడివిడిగా వైద్యవృత్తి ప్రారంభించారు.

కొన్నేళ్ళు గడిచాక, ఒకనాడు విశ్వపతిని సంప్రతించేందుకు, దీర్ఘ వ్యాధితో బాధపడుతున్న ధనికుడొకడు స్వర్ణపురం నుంచి వచ్చాడు. స్వర్ణపురం పేరు వింటూనే విశ్వపతికి, తన శిష్యులైన అనంతుడూ, నీలకంతుడూ గుర్తుకు వచ్చారు.

విశ్వపతి ధనికుణ్ణి, వాళ్ళను గురించి అడిగాడు. అందుకు ధనికుడు, ''అయ్యా,

జొన్నలగడ్డ రత్న



నీలకంఠుడు వైద్యుడుగా బాగా రాణిస్తున్నాడు. అతడి పని మూడు పువ్వులూ ఆరు కాయలుగా వున్నది. అయితే, అనంతుడికి మాత్రం వైద్యవృత్తి ఏమాత్రం అచ్చిరాలేదు. అతడు దాన్నివదిలి, తాతలు మిగిల్చిపోయిన పొలాలు దున్నుకు బతకాలనే ఆలోచనలో వున్నాడు," అని చెప్పాడు.

ఇది విని విశ్వపతి చాలా ఆశ్చర్యపోయాడు. తాను గొప్ప వైద్యుడు కాగలడనుకున్న అనంతుడు, ఎందువల్ల వైద్యుడుగా పేరు తెచ్చుకోలేకపోయాడో స్వయంగా తెలుసుకుందామని, స్వర్ణపురానికి వెళ్ళాడు.

విశ్వపతి, అనంతుడి ఇల్లు చేరేసరికి, అతడు లోపల ఎవరో రోగితో మాట్లాడుతున్నాడు. విశ్వపతి లోపలికి పోక, తలుపు పక్కనే నిలబడి వారి సంభాషణ వినసాగాడు.

అనంతుడు, రోగితో, "నీకు వచ్చింది పెద్ద జబ్బేమీ కాదు. కాస్త జలుబు చేసింది, అంతే. ఆమాత్రానికి ప్రాణం పోతున్నట్టు హైరానపడడం దేనికి? చిటికెడు పసుపు కొద్దిపాటి మంచి గంధంలో రంగరించి మొహానికి పులుముకుంటే సరిపోతుంది. వెళ్ళిరా," అన్నాడు.

అందుకు రోగి కోపంగా, "ఈ సంగతి తెలుసుకోవడానికి, మీదాకా రావడం దేనికి? మా అవ్వను అడిగినా చెప్పివుండేది," అంటూ వెళ్ళిపోయాడు.

రోగి వెళ్ళగానే విశ్వపతి లోపలికి వెళ్ళాడు. అనంతుడు ఆయనకు పాదాభివందనం చేశాడు. విశ్వపతి అతణ్ణి కౌగలించుకుని కుశల ప్రశ్నలు వేయగా అనంతుడు, "గురువర్యా, వైద్యం విషయంలో నేను చెప్పేదానిలోనూ, చేసేదానిలోనూ, నాకు తెలిసినంతవరకూ ఎలాటి లోపమూలేదు. అయినా నాచేత వైద్యం చేయించుకోవడానికి, యిక్కడి ప్రజలు అంతగా ముందుకురావడంలేదు," అని చెప్పాడు.

విశ్వపతి మందహాసంచేసి, "అలాగా! మరి, నీలకంఠుడి మాటేమిటి?" అని అడిగాడు.

"అతడిపని బాగానే వున్నది," అన్నాడు అనంతుడు.

"అతణ్ణి కూడా ఒకసారి చూసిపోవాలనుకుంటున్నాను. అతడింటికి వెళదామా," అన్నాడు విశ్వపతి.

విశ్వపతీ, అనంతుడూ నీలకంఠుడి ఇంటికి వెళ్ళేసరికి, అక్కడ చాలామంది రోగులు పడిగాపులు కాస్తున్నారు. లోపల నీలకంఠుడు ఒక రోగిని నఖశిఖపర్యంతం శ్రద్ధగా పరీక్షిస్తున్నాడు. ఆ రోగి అంతకు ముందు అనంతుడి దగ్గిరకు జలుబు వైద్యానికి వచ్చినవాడని, విశ్వపతి గుర్తించాడు. ఆయన లోపలికి వెళ్ళకుండా బయట నిలబడి నీలకంఠుడు రోగికి వైద్యం చేస్తున్న పద్ధతిని గమనించసాగాడు.

నీలకంఠుడు రోగితో, "పడిశెం పది రోగాలపెట్టంటారు. సకాలంలో సరైన మందు పడకపోతే, మరెందులోకో దింపగలదు. నీకు వచ్చిన భయం ఏమీ లేదు. నా దగ్గిర జలుబు పడిశాలను చేత్తో తీసి పారేసినట్టుగా తగ్గించే లేపనం ఒకటి వున్నది. దాన్ని యిప్పుడే, నీ ముఖానికి పట్టిస్తాను. క్షణాల్లో తెరిపినపడతావు,"



అంటూ సమీపంలో వున్న కల్వంలోంచి పచ్చగా వున్న లేపనం తీసి, రోగి ముఖానికి పూసి రుద్దసాగాడు.

అప్పుడు విశ్వపతి, అనంతుడితో మెల్లగా, "చూశావా, అనంతా! ఏదో గొప్ప లేపనం అంటూ నీలకంఠుడు, ఆ రోగికి పసుపుకొమ్ముల్ని మంచి గంధంతో రంగరించిన ముద్దను ముఖానికి పులుముతున్నాడు!" అన్నాడు.

"అంతేకాదు, గురువర్యా! జలుబు సామాన్యమైన రోగమనీ, దానికి శాస్త్రంలో ఖచ్చితమైన చికిత్సంటూ లేదనీ తెలిసి కూడా—నీలకంఠుడు అదేదో పెద్ద రోగమంటూ చిలవలూ పలవలూ చేసి, రోగికి

చెప్పడం కూడా నాకు సమ్మతంగా కనిపించడం లేదు." అన్నాడు అనంతుడు.

విశ్వపతి చిన్నగా నవ్వి, "నీలకంఠుడు చెప్పినదాంట్లోనూ, చేసినదాంట్లోనూ, ఒక వైద్యుడుగా నాకేమీ తప్పు కనిపించడం లేదు," అన్నాడు.

ఆ మాటలకు అనంతుడు ఆశ్చర్యపోయాడు.

విశ్వపతి అతడి భుజం తట్టి, "చూడు, అనంతా! కొందరు వ్యక్తులకు తమలో ఏమాత్రం అనారోగ్యచిహ్నాలు కనిపించినా, వెంటనే వైద్యుడి దగ్గిరకుపోయి నయం చేయించుకోవాలన్న ఆత్రుత కలుగుతుంది. జలుబుకు వైద్యం కోసం వచ్చిన యితడు అలాంటివాడే. అలాంటి వాళ్ళతో వైద్యుడు ఊరడింపుగా మాట్లాడడమే కాకుండా, తానివ్వబోయే మందు శక్తివంతమైనదనీ, గుణమిచ్చేదనీ నమ్మకం కలిగించవలసిన అవసరం కూడా వున్నది. రోగి మానసిక పరిస్థితినిబట్టి, చికిత్స నిర్ణయించేటప్పుడు వైద్యుడికి ఉపయోగపడేది లౌక్యం గాని, శాస్త్రజ్ఞానం మాత్రం కాదు. అందుచేతనే, నీలకంఠుడితో పోల్చిచూస్తే, వైద్యశాస్త్రంలో ఎంతో పరిజ్ఞానం వున్న నీకు, యిలాంటి లౌక్యం తెలియకపోవడంవల్లనే, వృత్తిలో అతడి కన్న ఎంతో వెనకబడి వున్నావు," అన్నాడు.

విశ్వపతి యింత చెప్పినమీదట, అనంతుడికి తనలో వున్న లోపం కొంతవరకు అర్థమయింది.

తర్వాత యిద్దరూ లోపలికి వెళ్ళి, నీలకంఠుణ్ణి కలుసుకుని చాలా విషయాలు మాట్లాడారు. విశ్వపతి తన శిష్యుల ఇళ్ళలో ఒక్కొక్క రోజు ఆతిథ్యం స్వీకరించి వెళ్ళిపోయాడు.

కొన్నాళ్ళ తర్వాత విశ్వపతి స్వర్ణపురం నుంచి, సుమేరుపురానికి వచ్చే పోయే వాళ్ళను విచారించి, అనంతుడు కూడా నీలకంఠుడిలా మంచి వైద్యుడుగా పేరు తెచ్చుకున్నాడని తెలిసి ఎంతగానో సంతోషించాడు.





# కృష్ణావతారం

ఆయుధాగారపు భటులు వచ్చి తన విల్లు విరిగిందని చెప్పగానే, కంసుడికి తన వీపే విరిగినట్టయింది. అతను పుట్టెడు విచారంతో లేచి, ఉత్సవానికి చేసిన ఏర్పాట్లు చూడబోయాడు. ఒక అందమైన రంగ స్థలం ఏర్పాటుచేసి, రాజూ, మంత్రులూ, పైనుంచివచ్చే రాజులూ, రాజబంధువులూ, భృత్యులూ, పౌరులూ, విలాసినులూ కూర్చోవటానికి వేరు వేరు స్థలాలు నిర్మించి, వాటికి మెట్లు అమర్చారు. అంతటా కనులపండువైన శిల్పాలూ, తెరలూ, తోరణాలూ ఉన్నాయి. అంతటా అలంకార వస్తువులూ, పూలూ, ధూపాలూ ఏర్పాటై ఉన్నాయి. వీటన్నిటినీ పరీక్షించి, పనివాళ్ళకు అవసరమైన పనులు చెప్పి, కంసుడు తన అంతఃపురానికి తిరిగివచ్చి, చాణూరముష్టికు లనే ఇద్దరు మల్లులను పిలిపించి, వారితో, "ప్రపంచంలో మీసాటి మల్లులు లేరు. బలరాముడూ, కృష్ణుడూ అనే ఇద్దరు కుర్రకుంకలు ఇప్పటిదాకా అడవిలో తిరిగినవాళ్ళు. వాళ్ళకు ధైర్యమూ, ప్రతాపమూ, శౌర్యమూ ఏ కోశానా లేవు. వాళ్ళు మీతో తలపడినప్పుడు మీరు వాళ్ళతో చాలాసేపు పెట్టుకోక, ఒక దెబ్బన చంపేసినట్టయితే నాకు చాలా మేలు కలుగుతుంది," అన్నాడు.

రాజు ఈ విధంగా అడిగినందుకు సంతోషించి మల్లులు, "మా కింతగా చెప్పాలా? ఆ కుర్రాళ్ళు చిక్కగానే

11. కంసవధ



నలిపేస్తాం. మా సంగతి తమ రెరగరా? ఇది మా కొక పనా?'' అని చెప్పి, పెద్దగా మల్లలు చరిచి, బొబ్బలు పెట్టి తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

తరవాత కంసుడు మహామాత్రుడనే మావటివాణ్ణి పిలిపించి, ''నువు నాకు చాలా ఆప్తుడివి. నీతో ఇప్పుడు ముఖ్యమైన పని పడింది. వసుదేవుడి కొడుకులు మహా చెడ్డవాళ్ళు, బలవంతులు. వాళ్ళిక్కడికి వచ్చి ఉన్నారు. ముందుగానే వేకువవేళ నువు కువలయాపీడాన్ని తీసుకుని రాజభవనద్వారం దగ్గిర సిద్ధంగా ఉండి, వాళ్ళు అక్కడికి రాగానే వాళ్ళ మీదికి దాన్ని ఉసిగొల్పు. కువలయాపీడం వాళ్ళిద్దర్నీ క్షణంలో పీనుగులను చేసేస్తుంది,'' అన్నాడు.

మర్నాడు తెల్లవారింది. రాజశాసనం ప్రకారం అందరూ వచ్చి రంగస్థలాన ఎవరెవరి స్థానాలలో వారు కూర్చుని, బలరామకృష్ణుల రాకకోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. కంసుడు చాలా ఎత్తున బంగారు సింహాసనం మీద, తెల్ల బట్టలూ, ముత్యాలతో కూడిన ఆభరణాలూ ధరించి, తెల్లటి గొడుగూ, వింజామరాలు వేయించుకుని, తెల్లని బట్టలు కట్టిన విలాసినులతో సహా చంద్రుడిలాగా ప్రకాశిస్తున్నాడు.

చాణూర ముష్టికులు మదించిన ఏనుగుల లాగా ఎంతో గంభీరంగా, ఉత్సవ రంగం ప్రవేశించి, కంసుడి కెదురుగా నిలబడ్డారు.

మహామాత్రుడు కువలయాపీడాన్ని ఎక్కి వచ్చి, ద్వారంవద్ద నిలిపి, బలరామ కృష్ణుల రాక కెదురుచూస్తున్నాడు.

కొంచెం సేపటికి బలరామకృష్ణులు ద్వారం వద్దకు వచ్చారు. వారిని అందరూ అమితాశ్చర్యంతో చూశారు. వాళ్ళు ఎంతో నిశ్చింతగానూ, నిర్వికారంగానూ ఉన్నట్టు కనపడ్డారు. వాళ్ళు ద్వారంవద్ద కనిపించగానే వాద్యాల మోత, ప్రేక్షకుల హర్ష ధ్వానాలూ మిన్ను ముట్టాయి. ఆ కోలా

హలం మధ్య మహామాత్రుడు కువలయాపీడాన్ని వాళ్ళమీదికి తోలాడు.

అది గమనించిన కృష్ణుడు బలరాముడికేసి నవ్వుతూ, ''కంసుడు మనని చంపించటాని కొక ఏనుగుగున్నను సిద్ధం చేశాడు. పాపం, తాను మృత్యువు కోరల సందున ఉన్న సంగతి ఎరగడు. నువు నన్ను గమనిస్తూ ఉండు,'' అని ముందుకు నడిచాడు. పెద్ద దంతాలూ, భయంకరమైన తొండమూ ఎత్తి, భూమి అదిరేలాగా అడుగులు వేస్తూ కువలయాపీడ మనే ఏనుగు మహారౌద్రంగా కృష్ణుడి పైకి వచ్చింది.

కృష్ణుడు దానితో యుద్ధం చేసే మిష మీద తన బలం అందరికీ చూపుదామనీ, కాస్సేపు వినోదం పొందుదామనీ, ముందు ఏనుగును దాని తొండంతో తన రొమ్ము మీద కొట్టనిచ్చాడు. తరవాత, ఎగిరి, దాని దంతాలపైన కాళ్ళు పెట్టి నిలబడి, ఎడమ కాలితో దాని కుంభస్థలాన్ని బలంగా తన్ని, దాని వీపు మీదికి వెళ్ళి, అది వెనక్కు చాచిన తొండాన్ని పట్టుకుని, కిందికి దూకి, పిడికిటితో దాని డొక్కల్లో పొడిచాడు. ఏనుగు వెనక్కు తిరిగేసరికి, దాని కాళ్ళ సందుగా వెనక్కు వెళ్ళి, దాని తోక పట్టుకుని గుండ్రగా తిప్పాడు. ఏనుగు చేసేది లేక కింద పడి, వెంటనే లేచి, అమిత రోషంతో అతని పైన తొండంతో బాదింది, దంతాలతో పొడిచింది. కృష్ణు డిక దాన్ని, చంప





పించాడు. అలాగే ముష్టికుణ్ణి బలరాము డితో యుద్ధం సాగించమన్నాడు.

చాణూర ముష్టికులు అంధ్రులు. దిగ్గజాలను పోలినవాళ్ళు. ప్రపంచంలో తమకు చాలినవాళ్ళు లేరన్న గర్వాతిశయం గలవారు. చాణూరుడు కృష్ణుణ్ణి సమీపించి వెటకారంతో కూడిన కోపంతో, ''గోవులను కాస్తూ, పిల్లలను భయపెట్టి గొప్ప ఖ్యాతి సంపాదించావు గాని, ఇవాళ నా పాల పడ్డావు, తప్పించుకోలేవు. మహారాజు, మెచ్చుకునేటట్టుగా నిన్నిప్పుడే యమకింకరుల కప్పగిస్తాను,'' అన్నాడు.

కృష్ణుడు చాణూరుడితో తాపీగా, ''కంసుడు నీ మీద చాలా ఆశలు పెట్టుకుని ఉన్నాడు. అందుచేత నీ బలమంతా చూపించు. వ్యర్థాలాపాలతో ఏమవుతుంది?'' అంటూ మల్లచరిచాడు.

చాణూరుడు కృష్ణుడి పైకి కలియబడ్డాడు. సభలో ఉన్నయాదవులు కృష్ణుణ్ణి గురించి భయపడ్డారు. ''కొండంత చాణూరుడికీ, పిల్లవాడు కృష్ణుడికీ మల్లయుద్ధ మేమిటి? అన్యాయం! ఇక్కడ ఉండే పెద్దలకు అమాత్రం జ్ఞానం లేదా? అదీగాక, మల్లయుద్ధం చేసే పద్ధతి ఇది కానేకాదు. మల్లులతో యుద్ధం చేసేవారికి సహాయకులు వెంట ఉండి, అలిసినప్పుడు శైత్యాది ఉపచారాలు చెయ్యాలి, మోటు

నిశ్చయించి, ఎగిరి కాలితో దాని ముఖం మీద తన్ని, దాని దంతం ఒకటి బలంగా పెరికి, దానితోనే ఏనుగు తలను బద్దలు కొట్టనారంభించాడు. త్వరలోనే కువలయాపీడం నేల కూలి ప్రాణాలు విడిచింది. దానితోబాటు కింద కూలిన మావటివాడి తల దాని దంతంతోనే పగలగొట్టి కృష్ణుడు వాణ్ణి కూడా చంపేశాడు.

ఏనుగు చేసిన గాయాలనుంచి రక్త ధారలు కారుతూ, చేతిలో దాని దంతం పట్టుకుని మహాభయంకరాకారంతో సభలో ప్రవేశించిన కృష్ణుణ్ణి చూసి కంసుడు అమిత క్రోధంతో చాణూరుడికేసి చూసి, కృష్ణుడితో మల్లయుద్ధం చెయ్యమని ఆజ్ఞా

బలానికీ నేర్పరితనానికీ తేడా గమనించాలి, అవసరమైనప్పుడు యుద్ధం ఆపాలి. ఇది వినోదంగాని, విరోధుల మధ్య కొట్లాట కాదే! అయినంతమటుకు చాలు. రాజుగారు ఇద్దరినీ తగిన విధంగా సత్కరించి, యుద్ధం ఆపు జెయ్యటం మంచిది,'' అని యాదవులు తమలో తాము అనుకోసాగారు.

ఆ మాటలు విని కృష్ణుడు వారితో, ''నన్ను ఇలాగే పోట్లాడనివ్వండి. మనోబలమూ, పరాక్రమమూ, ఓపికా, ఉత్సాహమూ, జయమూ ప్రదర్శించే యోధుడికి ఒడ్డూ, పొడుగూ, వయసూతో ఏం పని? నేను పగపట్టి వీణ్ణి చంపాలనే ఉద్దేశంతో నే ఉన్నాను. మిమ్మల్ని మెప్పిస్తాను. మీరు అదీ ఇదీ అనక, చూస్తూ ఉండండి. ఈ చాణూరుడు కరూశ దేశంలో పుట్టినవాడు. ఎందరో మల్లులను హతమార్చిన వీణ్ణి ఇప్పుడే పడగొట్టి గొప్ప కీర్తి సంపాదిస్తాను,'' అని చాణూరుడితో మల్లయుద్ధం ప్రారంభించాడు.

ఆ యుద్ధంలో ఆరితేరిన చాణూరుణ్ణి మించిన నేర్పు కృష్ణుడు చూపాడు. ఒకరి నొకరు వంచుతూ, తోస్తూ, వంగుతూ, ఎగురుతూ, ఒదుగుతూ, పక్కకు తొలగుతూ చాలా అద్భుతంగా వాళ్ళు యుద్ధం చేశారు. వీపుకు వీపూ, తలకు తలా తగిలినప్పుడూ, ఒకరి నొకరు గుద్దు



కున్నప్పుడూ గొప్ప ధ్వనులు పుట్టాయి. ఒకరి నొకరు చేతులతోనూ, కాళ్ళతోనూ తన్నుకుంటూ, దంతాలతోనూ, గోళ్ళతోనూ రక్కుకుంటూ పోరాడుతుంటే చూసే వారికి అతి భయంకరంగా ఉన్నది.

మొత్తంమీద అన్ని రకాలపట్లలోనూ కృష్ణుడి నేర్పే హెచ్చుగా కనబడి, సభికులు హర్షధ్వానాలు చేస్తే, కంసుడు కోపంగా ''ఆపండి'' అన్నట్టు చేత్తో సంజ్ఞ చేశాడు. కృష్ణుడు కొంతసేపు తన చాకచక్యం ప్రదర్శించి, చాణూరుడి పని తేల్చెయ్య నిశ్చయించాడు. చాణూరుడి పని కూడా చాలావరకు అయిపోయింది. దుర్బలుడై పోతున్న ఆ మల్లుడిపైన కృష్ణుడు ఒక్క




పెట్టున లంఘించి, వాడి నడి తల మీద పిడికిలితో ఒక్కపోటు పొడిచి, ఎగిరి మోకాలితో వాడి గుండెలో ఒక్క తాపు తన్నాడు. ఆ దెబ్బతో చాణూరుడు గుడ్లు వెళ్ళబెట్టి, నోట నెత్తురు కక్కుతూ కింద పడి ప్రాణాలు వదిలాడు.

కృష్ణుడు చాణూరుణ్ణి చంపే లోపునే బలరాముడు ముష్టికుణ్ణి హతమార్చేశాడు. మల్లులిద్దరినీ కడతేర్చి, బలరామకృష్ణులు రంగస్థలాన విజయులై నిలబడ్డారు. వాళ్ళు కంసుడి కేసి చూసిన చూపూ, కంసుడి ముఖంలో కనిపించిన క్రౌర్యమూ చూసి నందగోపుడు మొదలైన గోపకులందరూ భయంతో వణుకుతూ, ఎక్కడివాళ్ళక్కడ కుక్కిన పేనుల్లాగా ఉండిపోయారు.

తాను కని పారేసిన కొడుకు చాణూరుడి చేతిలో ఏమైపోతాడో, ఇంత కాలానికి కనపడి అంతలోనే ప్రాణాలు విడుస్తాడేమో నని తల్లడిల్లిన దేవకీదేవి, చాణూరుణ్ణి చంపిన తన కొడుకు దర్పం చూసి ఆనందాశ్రువులు రాల్చింది.

వసుదేవుడి ఆనందానికి కూడా మేర లేదు.

కంసుడికి మాత్రం ముఖాన చెమటలు పోస్తున్నాయి. దురాగ్రహంతో శరీరమంతా కంపిస్తున్నది. ఊపిరి భారంగా తీస్తున్నాడు. ఎర్రటి కళ్ళ నుంచి నిప్పులు కక్కే వాడి లాగా చూస్తూ అతను, నాలుగువైపులా చూసి, తన నౌకర్లను పిలిచి, "ఈ కుర్రాళ్ళను ఇద్దరినీ తీనుకుపోయి నగరం దాటి పంపెయ్యండి. నందగోపుణ్ణి పట్టుకుని, సంకెళ్ళతో బంధించండి. మిగిలిన గోపకులందరినీ శిరశ్ఛేదం చెయ్యండి. నా రాజ్యంలో గోపకుడన్నవాడు కనిపిస్తే దొంగలను శిక్షించినట్టు శిక్షించండి. వాళ్ళ సొత్తు తీసేసుకోండి. కుటిలుడైన వసుదేవుడికి క్రూరమైన శిక్ష ఇవ్వండి," అని ఆజ్ఞాపించాడు.

ఈ మాటలు విని ఎక్కడివాళ్ళక్కడ కొయ్యబారిపోయారు. మళ్ళీ పట్టరాని

శోకం ముంచుకొచ్చి దేవకీదేవి మూర్ఛ పోయింది.

కృష్ణుడు తన తల్లిదండ్రుల దైన్యమూ, బంధువర్గం పడే బాధా, సభలో ఉన్న వాళ్ళ అసహాయస్థితీ చూసి ఆగ్రహావేశం చెందాడు. అతను ఊహించరాని వేగంతో సింహాసనం మీద కంసుడున్న చోటికి మెట్లెక్కి వచ్చాడు.

సభలో వాళ్ళకు కృష్ణుడు ఎక్కి రావటం కనిపించలేదు. ఒక్క క్షణం రంగస్థలంలో ఉన్నాడు. మరుక్షణం అతను కంసుడి వద్ద ఉన్నాడు.

మరుక్షణం అతను కంసుడి కిరీటాన్ని తన్నేశాడు, దాని మణులు రాలాయి. కంసుణ్ణి జుట్టు పట్టుకుని తల వంచి, తల అంతటా పిడికిలితో తెగ పొడిచాడు. మోకాలితో గుండెల్లో పొడిచాడు. కంసుడు ఏమీ చెయ్యలేకపోయాడు. అతని మెడలో హారాలు తెగిపోయాయి. చెవిలో పెట్టుకున్న పూలు రాలాయి. బట్ట ఊడిపోయింది. ముక్కునా, చెవులా, నోటా రక్తం చిమ్మేలాగా, కనుగుడ్లు వెళ్ళుకొచ్చేలాగా కంసుణ్ణి కృష్ణుడు పైనుంచి కిందికి తోసి, చేత్తో, నెట్టాడు. ఆ తోపుతో కంసుడి శవం రంగ ద్వారాన పరిఘ ఆకారంలో పడిపోయింది.

ఇదే సమయంలో బలరాముడు, కంసుడి తమ్ముడైన సునాము డనే వాడి పైన సింహం లాగా లంఘించి, వాణ్ణి హతమార్చేశాడు.

కృష్ణుడు కంసుణ్ణి చంపిన చేతులతోనే వసుదేవుడి పాదాలు తాకి నమస్కరించాడు. వసుదేవుడు కృష్ణుణ్ణి గాఢంగా కౌగలించుకుని ఆశీర్వదించాడు. తరవాత కృష్ణుడు దేవకికి నమస్కరించాడు. ఆమె అతన్ని కౌగలించుకుని తల వాసన చూసింది.

తరవాత కృష్ణుడు ఉగ్రసేనుడికీ, పెద్దలకూ మొక్కి వారి దీవనలు పొంది, అందరినీ వెళ్ళి పొమ్మని చెప్పి, తాను బలరాముడితో సహా తన తండ్రి ఇంటికి వెళ్ళిపోయాడు.






# మోసగాళ్ళు

ఒకప్పుడు ఇద్దరు మోసగాళ్ళు ఉండే వాళ్ళు. ఒకడి పేరు వక్రబుద్ధి. రెండోవాడి పేరు దుర్బుద్ధి. వాళ్ళు దేశసంచారం చేస్తూ ఒకనాడు ఒక గ్రామం చేరారు. వాళ్ళకు పొలాల్లో ఒంటరిగా ఒక ఎద్దు కనిపించింది. వాళ్ళు దాన్ని తోలుకుపోయి మరొక చోట కట్టేసి, ఊళ్ళో ఉన్న సత్రానికి తిరిగి వచ్చారు. వక్రబుద్ధి సత్రంలోనే దిగబడి పోయాడు. దుర్బుద్ధి ఊళ్ళోకి వెళ్ళాడు.

ఈలోపల ఎద్దుగల ఆసామీ తన ఎద్దు పోయిందని తెలుసుకుని, ఆ మాట గ్రామస్థులందరికీ చెప్పసాగాడు. చిన్న గుంపు తయారయింది. ఫలాని వారి ఎద్దు పోయిందని అందరూ చెప్పుకుంటున్నారు.

దుర్బుద్ధి వారి వద్దకు వచ్చి, "ఏదో పోయిందనుకుంటున్నట్టున్నారే. సత్రంలో దిగివున్న మా గురువుగారు గొప్ప జ్యోతిషాచార్యులు. వారిని చూసినట్టయితే పోయిన వస్తువు జాడ చెప్పగలుగుతారు," అన్నాడు.

ఎద్దును పోగొట్టుకున్న ఆసామీ దుర్బుద్ధినీ, మిగిలిన గ్రామస్థులనూ వెంటబెట్టుకుని సత్రానికి వెళ్ళాడు.

వక్రబుద్ధి సంగతంతా విని, తన పెట్టె నుంచి తాటాకు పుస్తకాలు తీసి, అక్కడక్కడా చదివి, కళ్ళు మూసుకుని కొంతసేపు ఆలోచించినట్టు నటించి, "ఈ సత్రానికి ఉత్తరంగా పోతే ఒక పెద్ద వటవృక్షం వస్తుంది. అక్కడి నుంచి తూర్పుగా పోతే ఒక ఎత్తయిన చింత చెట్టు వస్తుంది. అటు నుంచి ఎడమ పక్కకు చూస్తే ఒక చిన్న మామిడిచెట్టు కనిపిస్తుంది. ఆ ప్రాంతంలోనే నీ పోయిన ఎద్దు ఉన్నది." అని ఆసామీతో అన్నాడు.

ఆసామీ వెంట దుర్బుద్ధీ, మిగిలిన వాళ్ళూ బయలుదేరి వెళ్ళారు. వక్రబుద్ధి

బర్మా జానపద కథ



చెప్పిన చోటనే ఎద్దు కనబడింది. గురువు గారి దక్షిణ అని దుర్బుద్ధి ఆసామి వద్ద పది రూపాయలు వసూలు చేశాడు.

మోసగాళ్ళకు బాగానే గిట్టుబాటు అయింది. వాళ్ళు ఆ గ్రామం విడిచి మరొక చోటికి ప్రయాణమవుతూండగా గ్రామాధికారి వారి కోసం వచ్చి, "మీ కోసమే వచ్చాను. మీరు ప్రయాణం కట్టినట్టున్నారు. ఇంకా నయం! కాస్త ఆలస్యమైతే నా గతి ఏమయేది?" అంటూ తాను వచ్చిన పని గురించి చెప్పాడు.

ఆయన ఇంట వుండే బంగారు పాన్‌దాన్ పోయింది. ఎవరో దాన్ని దొంగిలించారు. దాన్ని జ్యోతిషాచార్యులు గారు గ్రామాధికారికి తిరిగి ఇప్పించాలి.

వక్రబుద్ధి క్షణంపాటు దిమ్మెర పోయాడు. కాని మోసంలో సిద్ధహస్తుడు కావటంచేత, "ఇది వర్జ్య సమయం. ఇప్పుడేమీ చూడటానికి లేదు. రేపు ఉదయం వచ్చినట్టయితే ఆ దొంగతనం విషయం అచూకీ తీస్తాం!" అన్నాడు.

"చిత్తం, అలా అయితే రేపు సూర్యోదయంవేళ మళ్ళీ తమ దర్శనం చేసుకుంటాను," అని గ్రామాధికారి వెళ్ళిపోయాడు.

"మనం వెంటనే ఉడాయించటం మంచిది," అన్నాడు దుర్బుద్ధి.

"రాత్రి మాటుమణిగాక బయలుదేరుదాం," అన్నాడు వక్రబుద్ధి.

ఈలోపల గ్రామాధికారి, ఇంటికి తిరిగి వెళ్ళి, దొంగను జ్యోతిషాచార్యులు పట్టుకుంటానని మాట ఇచ్చాడనీ, ఆయనకు సాధ్యం కానిదంటూ లేదనీ, తన పాన్‌దాన్ తిరిగి దొరికినట్టేననీ అందరికీ చెప్పేశాడు.

ఆయన పరివారంలో ప్రారబ్ధం అనేవాడొకడున్నాడు. బంగారు పాన్‌దాన్ దొంగిలించినది వాడే. జ్యోతిషాచార్యుల సంగతి వినగానే వాడి గుండెల్లో రాయి పడింది. ఆ రాత్రి వాడు సత్రం కేసి వెళ్ళి, మోసగాళ్ళుంటున్న గది కిటికీకింద చేరి, లోపల జరిగే సంభాషణ ఆలకించసాగాడు.



"అప్పుడే మనం పోయి ఉండవలిసింది. ఇదేమిటి? చీకట్లోపడి దొంగ వెధవల్లాగ—నాకేమీ బాగా లేదు." అంటున్నాడు వక్రబుద్ధి.

"నన్నేమీ అనకు. ఈ దొంగతనం వచ్చి పడుతుందనుకున్నామా! ప్రారబ్దం! అహ, ప్రారబ్ధమే!" అన్నాడు దుర్బుద్ధి.

ఈ మాట వినేసరికి ప్రారబ్ధంగాడికి గుండె అవిసిపోయింది. వాడు లోపలికి వచ్చి, మోసగాళ్ళ కాళ్ళు పట్టుకుని, "బాబూ, రక్షించండి. పాన్‌దాన్ దొంగిలించినందుకు, నా తోలు వొలిచేస్తారు. అది ఎక్కడ దాచానో తమకు చెప్పేస్తాను. నా ప్రాణం కాపాడండి!" అన్నాడు.

"సరే, ఆ దాచిన చోటు చెప్పు." అన్నాడు వక్రబుద్ధి.

ప్రారబ్ధంగాడు పాన్‌దాన్ దాచినచోటు చెప్పి, చల్లగా తిరిగి వెళ్ళిపోయాడు.

గ్రామాధికారి మర్నాడు సూర్యోదయం వేళకు వచ్చాడు.

"వల్లకాడులో ఉండే సావడి మెట్ల దిగువన పాన్‌దాన్ పాతిపెట్టి ఉన్నది. వెంటనే వెళ్ళి తెచ్చుకోండి." అన్నాడు వక్రబుద్ధి గ్రామాధికారితో.

గ్రామాధికారి వెళ్ళి వల్లకాడులోని సావడి మెట్ల కింద తవ్వి చూస్తే పాన్‌దాన్ దొరికింది. అయన పరమానందభరితుడై జ్యోతిషాచార్యులకు వంద రూపాయలు కానుక ఇవ్వటమే గాక, అయననూ, అయన శిష్యుణ్ణీ తన ఇంటికి భోజనానికి అహ్వానించాడు. మోసగాళ్ళు విందు ఆరగిస్తూండగా రాజుగారి మనిషి వచ్చి గ్రామాధికారికి ఒక వార్త చెప్పాడు. అదేమిటంటే—

మూడు రోజుల క్రితం రాజధాని తీరపు రేవుకు ఏడు వర్తకపు ఓడలు వచ్చాయి. వాటి నిండా ఎంతో విలువైన వర్తకపు సరుకున్నది. ఓడలు గల వర్తకుడు రాజుగారితో ఒక పందెం వేశాడు. తానొక ఇనప పెట్టె ఇస్తాననీ, అందులో ఏమున్నదీ వారం లోపల రాజుగారు చెబితే తన ఓడ



లన్నీ రాజుగారికి ఇస్తాననీ, రాజుగారు చెప్పలేకపోతే రాజ్యం తన కివ్వవలసి వుంటుందనీ ఆయన అన్నాడు.

రాజుగారి దగ్గిర కొందరు దైవజ్ఞులున్నారు. వారి మీద రాజుగారికి అమితమైన విశ్వాసం. అదీగాక, ఆ ఏడు ఓడల సరుకూ కాజెయ్యాలని రాజుగారికి దుర్బుద్ధి కలిగింది. అందుచేత ఆయన వర్తకుడి పందెం ఆమోదించాడు. అయితే రాజుగారి దైవజ్ఞులు గుడ్లు వెళ్ళబెట్టేసి, ఆ ఇనప పెట్టెలో ఏమున్నదో చెప్పే శక్తి తమకు లేదన్నారు. మూడు రోజులు అయిపోయాయి. ఇంక నాలుగు రోజులలో పందెం గెలవకపోతే రాజుగారు రాజ్యభ్రష్టుడవుతాడు. ఆయనకు కంపరం పుట్టి తన రాజ్యంలో ఉన్న గ్రామాధికారులందరికీ కబురు చేశాడు—ఎక్కడ జ్యోతిష్కులున్నా వెంటనే పంపమని!

గ్రామాధికారి వక్రబుద్ధితో, "మీవంటి జ్యోతిషాచార్యులు ఉండగా మా రాజుగారికేమీ భయం లేదు. మీరూ, మీ శిష్యుడూ నా వెంట రండి," అన్నాడు.

విధిలేక మోసగాళ్ళు రాజుగారి వద్దకు వెళ్ళారు. అక్కడ వారికి రాజోపచారం జరిగింది.

గడువు అఖరు రోజు వచ్చింది. మర్నాడు ఉదయం ఇనప పెట్టెలో ఏమున్నదీ రాజు చెప్పకపోతే రాజ్యం పోతుంది; మోసగాళ్ళు రాజుకు చెప్పలేకపోతే వాళ్ళ తలలు పోతాయి!

"ఈ రాత్రికి పారిపోదాం," అన్నాడు దుర్బుద్ధి.

"ఎక్కడికని పారిపోదాం? రాజు మనల్ని తప్పక పట్టుకుంటాడు. చాలా అవమానకరమైన చావు చావాలి. అంతకన్న సముద్రంలో పడి ఈదుకుంటూ పోతే, గుట్టు చప్పుడు కాకుండా చావవచ్చు," అన్నాడు వక్రబుద్ధి.

ఝాముపొద్దు పోయాక, ఇద్దరూ సముద్రతీరానికి వెళ్ళి, సముద్రంలో దిగి ఈదుతూ పోసాగారు. కొద్ది దూరంలో

వారికి ఏవో ఓడలు తగిలాయి. ఒక ఓడలో నుంచి ఏవో మాటలు వినిపించాయి.

"చెప్పు, తాతా! ఆ పెట్టెలో ఏముంది?" అంటున్నది ఒక చిన్నపిల్ల.

"అదంతా నీ కెందుకు, తల్లీ? పొద్దు పోయింది. వెళ్ళి పడుకో," అంటున్నాడు ఆ పిల్ల తాత.

"పెట్టెలో ఏముందో చెబితే పడుకుంటా! లేకపోతే పడుకోను," అన్నది పిల్ల.

"తెల్లారగానే బయటపడేదేననుకో. ఆ పెట్టెలో ఏముందో తెలుసా? ఇనపపెట్టెలో ఒక ఇత్తడిపెట్టె ఉన్నది. ఇత్తడిపెట్టెలో ఒక వెండిపెట్టె ఉన్నది. వెండిపెట్టెలో ఒక బంగారుపెట్టె ఉన్నది. ఆ బంగారు పెట్టెలో అత్తరు సీసా ఉన్నది! చెప్పానుగా, ఇక వెళ్ళి పడుకో!" అన్నాడు పిల్ల తాత. అతను వర్తకుడి పెద్దసరంగు.

ఈ విషయం తెలియగానే మోసగాళ్ళు నిశ్శబ్దంగా ఈదుకుంటూ వెనక్కు తిరిగి వెళ్ళి, తెల్లవారుతూనే రాజుగారికి ఇనపపెట్టె రహస్యం చెప్పేశారు.

వర్తకుడు తన ఓడలన్నిటినీ రాజుగారికి అర్పించుకున్నాడు.

రాజుగారు వక్రబుద్ధిని తన ఆస్థాన జ్యోతిష్కులకు పెద్దగా నియమించాడు. ఇది మోసగాళ్ళకు ఇష్టం లేదు. ఎందుకంటే ఎప్పటికైనా తమ మోసం బయటపడి తీరుతుంది.

ఆ సాయంకాలం వక్రబుద్ధి రాజభవనానికి వెళ్ళి, రాజుగారితో కబుర్లాడుతూ ఉండగా, దుర్బుద్ధి ఏడుస్తూ వచ్చి, "గురూజీ, కొంప మునిగింది. మన బస కాలిపోయింది. జ్యోతిష గ్రంథాలన్నీ అగ్నికి ఆహుతి అయాయి!" అంటూ బొబ్బలెక్కిన తన చేతులు చూపాడు.

"అయ్యో, ఇంకేమున్నది? నా బతుకు తెరువే పోయింది!" అన్నాడు వక్రబుద్ధి.

"విచారించకండి. మీ కిద్దరికీ ఉన్నతమైన ఉద్యోగాలిస్తాను," అన్నాడు రాజు.

మోసగాళ్ళ ఆఖరు ఎత్తు కూడా పారింది. వాళ్ళు రాజుగారి దివాణంలో సుఖంగా బతికారు.





# రాజుపరీక్ష

మహాతలదేశాన్ని సింహకేతు డనే రాజు పాలించేవాడు. ఆయన సేనాధిపతి వీర వర్మ. ధైర్యసాహసాల్లో, యుద్ధతంత్రంలో గొప్పదిట్టగా వీరవర్మ పేరు గడించాడు. వయసుపైబడి దేహదారుఢ్యం తగ్గడంతో, ఆయనకు సేనాధిపతి పదవి నుంచి తప్పు కుని, విశ్రాంతి తీసుకోవాలన్న కోర్కె కలిగింది.

ఆయన ఒకనాడు ఈ విషయంగా బాగా ఆలోచించుకుని, రాజు సింహకేతుణ్ణి చూడబోయాడు.

ఆ సమయంలో మంత్రి కూడా అక్కడే వున్నాడు.

వీరవర్మ తన కోర్కెను వెల్లడించగానే, రాజు అయిష్టంగా, ''మీరు పదవి నుంచి విరమించడం, నాకు అంత సమ్మతం కాదు. అయినా, మీ కోర్కెను నేను కాదనలేను. ఒక పని చెయ్యండి. మీ కుమారు లిద్దరూ, ఎంతోకాలంగా మీతో పాటు వుంటూ, అనేక యుద్ధాల్లో, మీ అంతటివారనిపించుకున్నారు. వారిలో ఒకరిని, మీరే సేనాధిపతిగా నిర్ణయిం చండి,'' అన్నాడు.

ఆ మాటలు విని వీరవర్మ కొంతసేపు మౌనంగా ఊరుకుని, ఆ తరవాత, ''మహా రాజా, నా కుమారులు శూరవర్మ, జయ సింహుడు, నా తర్వాత సేనాధిపత్యం వహించడానికి తగినవాళ్ళే. అయితే, యిద్దరూ నా దృష్టిలో సరిసమానులు. కనుక, ఆ నిర్ణయమేదో తమరే చేయడం బావుంటుంది,'' అని జవాబిచ్చాడు నెమ్మదిగా.

ఇందుకు రాజు సరేనన్నాడు.

వీరవర్మ అక్కడి నుంచి వెళ్ళిన తర్వాత రాజు మంత్రితో సంప్రతించి, ఒక పథకం ఆలోచించాడు.

ఐచ్చు వీరాజు

మర్నాడు నిండుసభలో, రాజు, సేనాధిపతి వీరవర్మ పదవీవిరమణ గురించి సభికులకు తెలియబరిచి, "ఆయన కుమారులు శూరవర్మ, జయసింహుల్లో ఒకరు మన సైన్యాధిపత్యం వహించడం మేలని నిర్ణయించాము. అయితే, అందుకు యిద్దరిలో అర్హులెవరో తెలుసుకోవలసి వున్నదిగదా!" అన్నాడు.

అవునన్నట్టు సభికులందరూ కరతాళ ధ్వనులు చేశారు.

అప్పుడు రాజు సింహకేతుడు, శూరవర్మనూ, జయసింహుడినీ దగ్గిరకు పిలిచి, "రాజపదవిలాగా, సేనాని పదవి వంశ పారంపర్యం కాదన్న సంగతి, మీరెరిగినదే! అయితే, శౌర్యసాహసాల్లో, యుద్ధ నైపుణ్యంలో మీరు, మీ నాన్నగారికి అన్ని విధాలా యీడైనవారని, నాకు బాగా తెలును. ఇప్పుడు మీకొక పరీక్ష పెట్టబోతున్నాను. ఆ పరీక్షవల్ల తేలే దేమంటే, మీ యిద్దరిలో ఎవరు ఎక్కువ విషయపరిజ్ఞానం, లోకంపోకడ ఎరిగినవాళ్ళన్నది!" అన్నాడు.

శూరవర్మా, జయసింహుడూ పెట్టబోయే పరీక్ష తమకు సమ్మతమే అన్నట్టు చిరునవ్వు నవ్వారు.

రాజు వాళ్ళతో, "ఆ కనబడే మూడు గదుల్లో వుంచబడినవాటిని మీరు పరిశీలించి, వాటిలో మీకు ఏది యిష్టమో తేల్చి చెప్పాలి. మొదటి గదిలో ధనరాసులూ, రెండవ గదిలో యుద్ధసామగ్రి, మూడవ



గదిలో ఆహారధాన్యాలూ వున్నవి. మీరు వెళ్ళి వాటిని పరిశీలించి వాటిలో మీకేది యిష్టమో నిర్ణయించుకుని, సభకు తెలియ జేయండి,'' అన్నాడు.

ఒక భటుడు వచ్చి శూరవర్మను వెంట బెట్టుకుపోయి, గదుల ముందు వదిలి తిరిగివచ్చాడు.

శూరవర్మ, మూడు గదుల్లో వున్న వాటిని క్షుణ్ణంగా పరిశీలించి, రాజువద్దకు తిరిగి వచ్చి, ''మహారాజా, నాకు రెండవ గదిలో వున్న యుద్ధసామగ్రి అంటే యిష్టం,'' అన్నాడు.

రాజూ, మంత్రీ చిరునవ్వునవ్వారు.

తర్వాత జయసింహుడు, శూరవర్మ లాగే, భటుడితో వెళ్ళి ఆ గదులలో వున్న వాటిని పరిశీలించి వచ్చి, ''మహారాజా, నాకు మొదటి గదిలో వున్న ధనరాసు లంటే యిష్టం,'' అన్నాడు.

వెంటనే రాజు, ''అలాగా! ఏకారణం వల్ల, ఆ ధనరాసులంటే నీకిష్టం?'' అని ప్రశ్నించాడు.

''మహారాజా, లోకంలో అతి ముఖ్య మైనది ధనం! ఆ ధనంతో మిగతా రెండు గదులలో వున్న యుద్ధసామగ్రినీ, ఆహార ధాన్యాలనూ కూడా సులభంగా సమ కూర్చుకోవచ్చు. అందువల్లనే, నాకు అక్కడ వున్న ధనరాసులంటే యిష్టం,'' అని జవాబిచ్చాడు జయసింహుడు ఎంతో గంభీరంగా.

మరుక్షణం సభలో వున్నవాళ్ళందరూ, ఆ జవాబుకు తృప్తిపడినట్టు కరతాళ ధ్వనులు చేశారు.

రాజు సింహకేతుడు, పరమానందంతో తన మెడలోని ముత్యాలహారం తీసి, జయసింహుడి మెడలో వేస్తూ, ''జయ సింహుడి లోకపరిజ్ఞానం ప్రశంసింప దగింది. అతణ్ణి ఇప్పుడే సేనాధిపతిగా నియమిస్తున్నాను,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

సభికులందరూ మరొకసారి, ఆమోద సూచకంగా ఆనందంతో కరతాళధ్వనులు చేశారు.





# దేవుడు సాక్షి!

కుందాపురం అనే గ్రామంలో గోవిందప్ప అనే గొప్ప దొంగ వుండేవాడు. దొంగతనం వాళ్ళ వంశ వృత్తి. గోవిందప్ప తండ్రి తాతలు కూడా దొంగలే. దొంగతనం కుల విద్యగా వాళ్ళ ఇంట వుంటున్నది.

గోవిందప్పకు ఒక చెల్లెలుండేది. ఆమెకు ఒక కొడుకుండేవాడు. వాడి పేరు దేవుడు. మేనమామ దగ్గిరికి పోయి దొంగతనం నేర్చుకోమని దేవుణ్ణి వాడి తల్లి గోవిందప్ప వద్దకు పంపింది.

దేవుడు పుటక చేతనే మంచి దొంగ. అందుచేత వాడికి గోవిందప్ప దగ్గిర చోర విద్య బాగా అబ్బింది. వాడు మేనమామ కన్న కూడా యుక్తిగా దొంగతనాలు చేయ గలవాడు. ఈ సంగతి గ్రహించి గోవిందప్ప తాను దొంగతనానికి వెళ్ళినప్పుడల్లా తన మేనల్లుడైన దేవుణ్ణి కూడా వెంటపెట్టుకుని వెళుతూ వచ్చాడు.

ఒకనాడు గోవిందప్పా, దేవుడూ కలిసి దొంగతనానికి గాను మరొక గ్రామం వెళ్ళారు. వారా గ్రామం చేరేసరికి చీకటి పడింది. ఆ గ్రామంలోని న్యాయాధికారి శ్రీమంతుడని విని, వాళ్ళు ఆ రాత్రికి ఆయన ఇంట దొంగతనం చేద్దామనుకున్నారు.

ఆ న్యాయాధికారి ఒక రకం మనిషి. ఆయనకు పిల్లలు లేరు. ఆయనా, ఆయన భార్యా కూడా అస్తమానమూ నోములు నోచేవారు. ఉపోషాలుండేవారు.

న్యాయాధికారి ప్రతి రోజూ ఎంతో పొద్దు పోయిగాని ఇంటికి రాడు. ఈ సంగతి తెలుసుకుని గోవిందప్పా, దేవుడూ పెంద లాడే తమ పని పూర్తి చేసుకుందామను కుని న్యాయాధికారి ఇంట ప్రవేశించారు.

''నాకు ఆకలి దహించుకుపోతున్నది. నేను తినటానికేమన్నా దొరుకుతుందేమో చూస్తాను,'' అన్నాడు దేవుడు.



''నేను మిద్దె మీదికి వెళ్ళి డబ్బూ, దసకమూ తెస్తాను. నేను ముందొస్తే ఈ చెట్టు కింద ఉంటాను. నువే ముందు వస్తే కూడా అక్కడే ఉండు. ఇద్దరమూ కలిసి ఇంటికి బయల్దేరుదాం,'' అన్నాడు గోవిందప్ప.

తరవాత గోవిందప్ప మిద్దె మీదికి వెళ్ళాడు. దేవుడు లోపల ప్రవేశించాడు. వీధి వాకిలి దగ్గిరిగా వేసి ఉన్నది. దేవుడు లోపలికి వస్తూ ఆ తలుపు గడియపెట్టాడు.

వాడు పిల్లిలాగా, చప్పుడు చెయ్యకుండా, వంట ఇంటిదాకా వెళ్ళి లోపలికి తొంగి చూశాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది. న్యాయాధికారిగారి భార్య వంట ఇంట్లో కొంగు పరుచుకుని కునుకు తీస్తున్నది. పక్కనే దేవుడి మందిరం ముందర వంటకాలు పెట్టి ఉన్నాయి. వాటి సువాసన తగలగానే దేవుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది.

అసలు సంగతేమంటే ఆనాడు ఏకాదశి. న్యాయాధికారీ, భార్యా రోజంతా ఉపవాసం చేశారు. రాత్రి భోజనానికి బదులు గిన్నెడు పెసరకట్టు పరమాన్నమూ, లెక్కగా ఎనిమిది దోశెలూ, దోశెలతో తినటానికి కొబ్బరి పచ్చడీ సిద్ధం చేసి, ఇంటావిడ భర్త రాకకు నిరీక్షిస్తూ నడుము వాల్చింది. ఉపవాసంతో నీరసించి ఉండటం చేత ఆమెకు నిద్రపట్టింది.

దేవుడు చల్లగా వంటకాల వద్ద చేరి కొబ్బరి పచ్చడి నంజుకుంటూ దోశెలు తినసాగాడు. అసలే ఆకలి మీద ఉన్నాడు. దానికి తోడు దోశెలు చాలా కమ్మగా వున్నాయి. పచ్చడి పసందుగా వుంది. అందుచేత వాడు దోశెలన్నీ తిన్నదాకా ఆగలేకపోయాడు. అయిపోయాయి గాని, ఉంటే ఇంకా తినేవాడే. తరవాత వాడు పెసరకట్టు పాయసం గిన్నె ఎత్తి మొత్తమంతా తాగేశాడు. అది కూడా వాడి నోటికి అమృతంలాగుంది. అటువంటి పాయసం వాడెన్నడూ తాగి ఎరగడు.



దేవుడి ఆకలి పూర్తిగా తీరిపోయింది. ఇక వచ్చిన దారినే వెళ్ళిపోదామనుకుంటూండగా వీధి వాకిలి దబదబా తట్టిన చప్పుడూ, "తలుపు! తలుపు!" అన్న పిలుపూ వినిపించాయి.

ఆ పిలుపుకు ఇంటావిడ చివాల్న లేచి, "వచ్చె, వచ్చె!" అంటూ అవతలికి వెళ్లింది. ఆ వచ్చినవాడు ఇంటాయన అయి ఉంటాడు. భోజనానికి వంట ఇంట్లోకే వస్తాడు. ఎటు పోవటానికీ దారిలేక దేవుడు చటుక్కున అటక ఎక్కి కూచున్నాడు.

వాడు ఊహించినట్టుగానే ఇంటాయన భార్యతో సహా వంటింట్లోకి వచ్చి, "ఫలహారం సిద్ధం చేశావుగదా! ఆకలి దహించుకుపోతోంది!" అన్నాడు.

"ఎప్పుడనగా సిద్ధమయింది! మీరెప్పుడు వస్తారా అని చూస్తున్నాను," అంటూ ఇంటావిడ దేవుడి మందిరం కేసి చూసింది. ఆమెకు ఖాళీ గిన్నెలు మాత్రమే కనిపించాయి. "అయ్యో, నేను చేసిన ఫలహారం ఏమయింది?" అన్నదామె అదుర్దాగా.

"ఏమవుతుంది? ఆకలేసి, నేను వచ్చినదాకా ఆగలేక నువే తినేసి వుంటావు!" అన్నాడు భర్త. ఎంతో ఆశతో వస్తే ఖాళీ గిన్నెలుండటం చూసి ఆయనకు మండింది.

"నేనా? మీరు తినకుండా ఏనాడన్నా నేను ముందు తిన్నానా? నేను తిన్నదీ లేనిదీ దేవుడు చూస్తూనే ఉన్నాడే!" అన్నది భార్య.

"నువు తినకపోతే ఇంకెవరు తిన్నారు? అసలు ఇక్కడికెవరు వస్తారు?" అన్నాడు భర్త కోపంగా.

"నాకు కాస్త కునుకుపట్టింది. ఆ సమయంలో దేవుడు తిన్నాడేమో!" అన్నది భార్య.

"దేహశుద్ధి చేస్తేగాని నువు నిజం చెప్పవు. చూస్తూ వుండు. ఇలా చేసినందుకు నిన్ను చంపేస్తాను!" అంటూ భర్త అవతలికి వెళ్ళి ఒక కర్ర తెచ్చాడు.

ఇదంతా చూస్తున్న దేవుడికి ఆ భర్తను చూసి పట్టరాని కోపం వచ్చింది. వాడు అటక మీదినుంచి భార్యా భర్తల మధ్యకు దూకి భర్తతో, ''ఆవిడ నిజమే చెప్పింది. నేనే దేవుణ్ణి. నేను మీ ఇద్దరి ఫలహారమూ తినేశాను. ఆవిణ్ణెందుకు నిష్కారణంగా కొట్టటం?'' అన్నాడు. భర్త దేవుడి కేసి తెల్లమొహం వేసి చూస్తూ నిలబడ్డాడు.

ఇంతలో బయటి నుంచి ''దేవుడూ!'' అని చిన్నగా పిలుపు వినిపించింది.

''ఓయ్, వస్తున్నా!'' అంటూ దేవుడు దర్పంగా బయటికి వెళ్ళిపోయాడు.

గోవిందప్ప మిద్దె మీద అంతా వెతికినా దొంగిలించటానికి ఏమీ దొరకలేదు. అతను తన మేనల్లుడి కోసం కొంతసేపు చూసిన మీదట వంట ఇంటి వేపునుంచి గట్టిగా మాటలు వినపడ్డాయి. దగ్గిరికి వచ్చి వింటే ''దేవుడు'' అనే మాట కూడా వినిపించింది. తరవాత దేవుడి గొంతు కూడా వినిపించింది. తన మేనల్లుడు ఇంటివాళ్ళకి దొరికిపోయాడేమోనని గోవిందప్ప భయపడి పిలిచి చూశాడు. దేవుడు వస్తున్నానని చెప్పటం విని అతనికి మరింత ఆశ్చర్యమయింది. తరవాత వాళ్ళిద్దరూ తమ ఊరికి పోయేటప్పుడు తన మేనల్లుడు చేసిందంతా విని, ''దొంగ వంటే దొంగవురా! దొంగతనం చేసి, చేశానని ఇంటివాళ్ళకు చెప్పి మరీ వచ్చేశావు!'' అని గోవిందప్ప ఎంతగానో మెచ్చుకున్నాడు.

దేవుడు వెళ్ళిపోయిన కొద్ది సేపటికి న్యాయాధికారి భార్య, ''అయ్యో, అలా చూస్తూ, ఇక్కడే నిలబడ్డారేమిటండీ? వాడు దొంగలాగుంది, వెళ్ళి పట్టుకోండీ!'' అన్నది. అప్పుడు న్యాయాధికారి ఇంటి నుంచి గబగబా బయటికి పరిగెత్తాడు. కాని అప్పటికే దొంగలు చాలా దూరం వెళ్ళిపోయారు.

ఆ తరవాత న్యాయాధికారి భార్య మళ్లీ ఏదో ఫలహారం చేసింది. భార్యా భర్తలు దానితోనే తృప్తిపడవలిసి వచ్చింది.




పిడుగు వృక్షాలు
ఇంగ్లాండులో సిందూర (ఓక్) వృక్షాలూ, పాప్లార్ చెట్లూ, తరచూ పిడుగుపాటుకు గురి అవుతున్నవి:


ఆపద ముంచుకొచ్చినప్పుడు, నిప్పుకోడి తలను ఇసుకలో దూర్చేసుకుంటుందనే నమ్మకం ప్రచారంలో ఉన్నది. అయితే, ఇది నిజం కాదు. ఏదైనా శబ్దం వినవచ్చినప్పుడు ఈ కోడి, తలను నేలదగ్గరకి వంచి, ఏకాగ్రతతో వింటుంది. ఆపద సమీపిస్తున్నదని తెలియగానే, అన్ని ప్రాణుల లాగా ఈ పక్షీ పరుగు లంకించుకుంటుంది:
నిప్పుకోడి 'అబద్ధం'


లావా
లావాద్రవం ఉష్ణోగ్రత, దాదాపు 4,000 డిగ్రీలు ఫారన్‌హీట్ వుంటుంది:

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఆకలికి వయసు లేదు! రెండవ ఫోటో: ప్రమాదాల భయం లేదు!

పంపినవారు: పి. రవీంద్రబాబు, చేజర్ల, నెల్లూరు జిల్లా, (ఆం.ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# కొత్త సెరిలాక్ ఆరంజ్




## మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందించడానికి మరొక మార్గం

మీ పాపాయికి మరొక లాభాన్ని అందజేసేందుకు యిదిగో కొత్త సెరిలాక్ ఆరంజ్. మీ పాపాయి కొత్త రుచులను అలవరుచుకున్నప్పుడు, అతని ఆహారంలో మరింత వైవిధ్యం తెచ్చే లాభం. దీనితోబాటు నారింజ మంచితనం కూడా లభిస్తుంది.

మీరు మీ పాపాయికి సెరిలాక్ ఆరంజ్ యిస్తున్నారంటే, అతనికి సెరిలాక్ లాభాలన్నింటిని యిస్తూనే ఉన్నారన్న మాట–ప్రతి సారి తినిపించినప్పుడు పరిపూర్ణమైన పోషక శక్తి, చక్కటి రుచి, క్షణాలలో తయారు కావడం.

కాబట్టి, పాలు త్రాగించడంతోబాటు, 4 నెలల నుంచి అతనికి సెరిలాక్ వీట్, 6 నెలల నుంచి సెరిలాక్ ఆపిల్/క్రొత్త సెరిలాక్ ఆరంజ్ యివ్వండి–మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందజేసేందుకు రుచి కరమైన మూడు మార్గాలు.

పరిశుభ్రంగా తయారు చేయడానికి, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారం సమకూర్చేందుకుగాను, దయచేసి డబ్బా మీద ఉన్న సూచనలు జాగ్రత్తగా అనుసరించండి.




Nestlé.

R K SWAMY/FSL/4974-TEL




Now from Lion Pencils, here's another Novelty...
the Pearl finished **LION PINKY** pencil, a pretty pencil to behold.
Superb in looks, super smooth in writing with its HB Lead
strongly bonded to give you unbreakable points.

***Also available with rubber tip and hexagonal***

***Other popular brands of Lion Pencils are:***

Lion **MOTO,** Lion **TURBO,** Lion **SWEETY,** Lion **CONCORD,**
Lion Hi-Tech **METALLIC,** Lion **MASH-HOOR,** Lion **EXECUTIVE,**
Lion **NOVELTY,** Lion **GEEMATIC** Drawing Pencils
and **RATTAN** Colour Pencils & Wax Crayons.

**LION PENCILS PVT. LTD.** 95 Parijat, Marine Drive, Bombay 400 002.

National-407

# విజేతలకు చందమామ అభినందనలు

## మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ

## బంపర్ సెక్షన్

| | | |
|---|---|---|
| నిశాకరుడు | శౌర్యపాలుడు | హంపి |
| ఓటోకో | కంసుడు | సులోచనుడు |
| **Kamal Varma**<br>K-593, Lane No. 10<br>Dakshinpuri<br>NEW DELHI-110 062 | **Mangesh Mukund**<br>C/o Dr.Mukund Narchari Shete<br>Bungalow No. 32,<br>Scheme No.4<br>Sector 21<br>Pradhikaran Nigadi,<br>POONA-44 | **Amrut Kumar Mohanty**<br>C/o N. C. Mohanty<br>Biologist,<br>Urban Malaria Unit, S.B.D<br>At/P.O Budharaja<br>Dist: Sambalpur (ORISSA)<br>Pin 768 004 |
| **I Prize** | **II Prize** | **III Prize** |

వి. మల్లీశ్వరి, పెనుగొండ. ఎ. రాజశేఖర్, ఇడుపులపాడు. ఎ. వి. ఎస్. పూర్ణానంద్, విశాఖపట్నము. ఎన్. భారతి, కందుకూరు. ఎమ్. వి. రాఘవేంద్రరావు, విజయవాడ. వై. రామకృష్ణ, హైదరాబాదు. జనమంచి సంతోష్‌కుమార్, జగిత్యాల. చిల్లరిగె రాఘవేంద్రవరప్రసాద్, అంగలూరు. ఎమ్. సుబ్రహ్మణ్యం, మద్రాసు. వి. సి. సునీత, వెంకటగిరి. జి. ఎస్. మాధవి, గుడివాడ. మి. బాలర్షి, ఎట్టయపురం. మెండు శాంతి, కోడుమూరు. వై. ఎస్. కవిత, శక్కర్‌నగర్. ఎస్. స్రవంతి, హస్తకొండ. ఒ. వాణి, పి. యస్. కంద్రిగ. కె. విజయకృష్ణ, హుబ్లి. ఎస్. భద్రిప్రసాద్, సూర్యాపేట. వి. తేజభానురెడ్డి, రామానుజపల్లె. సిహెచ్. వి. కార్తిక్, ఏలూరు.

Consolation prizes


మీ అభిరుచికి సరిక్రొత్త రుచి!
గొప్ప బాన్ బాన్ లు న్యూట్రీన్ వారినుండి!
రుచికర, మృదుమధుర, ఫలరసమయ ఆహ్లాదకర రుచుల్లో హాయినిపించే నోరూరించే సువాసనలలో!
nutrine BON BON
శ్రేష్ఠమైన సరిక్రొత్త బాన్ బాన్‌లు న్యూట్రీన్ వారినుండి!
మిల్క్ క్రీం
లెమన్ కోకనట్
ఫ్రూటి • చాకొమింట్
nutrine
BON BON
nutrine భారత దేశంలో అత్యధికంగా అమ్ముబడే మిఠాయిలు
న్యూట్రీన్ కన్ఫెక్షనరి కంపెని ప్రై. లిమిటెడ్. చిత్తూరు-517 002 (ఆంధ్రప్రదేశ్)
NC/8571